

# అభినవ

# -- హారిశ్చంద్రీయము

(అయిదంకముల నాటకము)

---

ఇయ్యది

మేడూరి హనుమయ్య

విరచితము.

ప్రథమ ముద్రణము 1000

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1924

 [ వెల రు 0-12-0



గ్రంథకర్త:
మే[illegible] హనుమయ్య.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# పీఠిక.

అయ్యలారా,

సారస్వతసామ్రాజ్యమునందు దృశ్యకావ్యములకుఁగూడ ప్రశస్తమగు స్థానము గలదు. "కావ్యములందు దృశ్యకావ్యముగమ్యమైన" యనుసనాతనవాక్యము లోకప్రసిద్ధము. కావున బహువిధముల భాషను, కళలను అభివృద్ధికరములగు మార్గముల న్వేషింపఁబడుచున్న వర్తమానకాలమున దేశాభిమానులగు కవులు, పండితులు, నాటకకళాభివృద్ధికరములగు సూచనలను ప్రచారమునకు దెచ్చుచున్నారు. ఏతత్కారణముననే యాంధ్రదేశమున నెన్నఁడును కానఁబడని నాటకప్రదర్శనాభిలాషము, నాటకగ్రంథరచనా కుతూహలము నానాటికి హెచ్చుచున్నయది. శ్రీమంతులు, విద్యావంతులు, నగు బుద్ధిశాలురు నాటకప్రదర్శనములఁ జేయుచుండుటయు, ఉభయభాషాభిజ్ఞులగు సత్కవులు నాటకగ్రంథరచనకుఁ గడంగుటయు, ఈవిషయమును పలుమార్గంబులఁ జాటుచున్నయవి.

తెలుఁగునాటకములు పెసల ప్రక్రమించి తెలుగువారి చిత్తముల నాకర్షించిన నవీననాటకసంబంధమగు విచిత్రసంచలనము దేశీయకవులయందును, గాయకులయందును, నటులయందును, క్రొత్తక్రొత్తవికాసముల జనింపఁజేసినది. దానిఫలితముగ నాంధ్రులమగు మనకు సరసకవితాస్ఫూర్తిసహితములును, అద్భుతరచనాకౌశలవిద్యోతమాన భాషావైభవంబులును, నగు పలువు నాటకగ్రంథ పఠన మొనర్పగల భాగ్యము లభించినది. ఏతాదృశ నవీననాటకగ్రంథపఠనమే పాండిత్యప్రకర్ష మించుకంతయు తెలియనినాకు నాటకగ్రంథరచనా కార్యక్రమమునకుఁ బ్రోత్సాహము గలిగించినది.

ఛందోఽలంకారసంబంధములగు భాషామర్మముల తెలియని నాకు గావ్యపఠనమునందును, శ్రద్ధసాహిత్యసేవనమునందును నభిలాషము మిక్కుటము. మఱియు నాటకగ్రంథపఠనమునందు విశేషించి నాకు నభిమానము. కావున సుప్రసిద్ధులగు నాంధ్రకవులురచించిన నాటకగ్రంథములఁ బెక్కింటిఁ జదివినాఁడను. కుదరు నాటకములపైనాకుగల యభిమానముచే వెనుకముందులరయక నాటకగ్రంథ మొకటి రచించుటకు మనసుసాహసమునకుఁ బాల్పడినాఁడను. ఈసాహసము పున్నట్టుండియు నాకుగల గ్రంథరచనాభిలాషమునకు బలమొసంగినది. కావున నేను నాటకరచనమునకు పూనుకొంటిని.

హరిశ్చంద్రుని కథను జాలమంది కవిపుంగవులిదివఱకే నాటకములుగ రచించిరని నేనెఱుంగుదును. మఱియు నాగ్రంథకర్తల హృదుల లలిత కవితా శిల్పనైపుణ్యంబునకు నానారససంపుటితపై యెవ్విధమునను సరిరాదని యెఱుంగుదును. ఆయా హరిశ్చంద్రనాటకముల మించునటుల కవితా వైచిత్రినిగాని - కథాసంవిధానమునుగాని ప్రదర్శింపఁజాలు నైపుణిగలదను నమ్మకమునునాకు లేదు. కాని పరమ పవిత్రవర్తనుఁడగు హరిశ్చంద్రుని జీవితమును తలఁచినకొలంది స్వీయవాక్కులఁ గీర్తించినగాని నాహృదయమునకు దనివిసనదను నేకోద్దేశముతో నియ్యది యథాశక్తిని రచించినాఁడను.

పలుకుభేదముతప్ప విషయమంతయు ముందటినాటకకవులు తెలిపినదే; భావములును పోలికలునుగూడ నట్టివే; ఇందేదియు నవీనము లేదని సవినయముగ నాదేశీయ సోదరులకు విన్నవించుచున్నాఁడను. ఈగ్రంథరచనమున నాకుపకరించిన హరిశ్చంద్ర నాటకగ్రంథకర్తలగు కీ॥ శే॥ వీరేశలింగము పంతులుగారికిని బ్ర॥ శ్రీ॥ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇది కవితారీతి నలవఱచుకొనుటకై నా రచించిన మొట్టమొదటి గ్రంథమగుట నిండుఁ దప్పులు ముప్పులుగ గలవు. పాండితీగరిమచాలనట్టియు, వ్యాకృత - సాహిత్య పరిశ్రమ మెఱుంగనట్టియు, నాకవితయందు దప్పులుండుట సహజము. గాన నిందలి చ్యుతసంస్కారములఁ గాంచి కనియక తజ్జ్ఞులు నాకుఁ దెలిపినచోఁ గృతజ్ఞుఁడనై ద్వితీయ ముద్రణమునందు సవరించుకొందును.

ఈగ్రంథరచనకుఁ బ్రోత్సాహము గలిగించి నాకుఁ బెక్కురీతులఁ దోడ్పడుచుండిన మా గ్రామ నివాసులును, బోర్డు ఎలిమెంటరీస్కూలు హెడ్మాస్టరును, మన్మిత్రులును నగు మహారాజశ్రీ పరమాత్ముని హనుమంతరావు పంతులు గారికిని నాబావమఱఁది మహారాజశ్రీ అన్నమనేని రాఘవయ్యగారికిని ఆయురారోగ్యంబులొసంగి రక్షించుగాతమని సర్వేశ్వరుఁ బ్రార్థించుచు దీని నింతట ముగించుచున్నాఁడను.

ఘుడియపూడి,
30—10—24.

ఇట్లు,
మేడూరి హనుమయ్య,
గ్రంథకర్త.

# ఈనాటకమున వచ్చు పాత్రలు.

---

## పురుషులు.

హరిశ్చంద్రుడు—కథానాయకుడు.

దేవేంద్రుఁడు.

బృహస్పతి.

వసిష్ఠుడు.

నారదుఁడు.

విశ్వామిత్రుఁడు.

గౌతముఁడు.

మంత్రి.

రైతులు.

లోహితాస్యుఁడు—(బాలుఁడు)

నక్షత్రకుఁడు.

భేతాళుఁడు.

అర్బుదుఁడు.

కాలకౌశికుఁడు.

శంకరుఁడు.

వీరబాహుఁడు.

వీరదాసుఁడు.

సూత్రధారుఁడు.

## స్త్రీలు

చంద్రమతి.

మతంగకన్యలు.

కలహకంఠి.

పార్వతి.

నటి.

N. B.—సందర్భానుసారముగా యింకను రయితులు, పౌరులు, ఋషులు ఉందురు.



శ్రీరామ.

శు భ మ స్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# అ భి న వ హ రి శ్చం ద్రీ య ము.

---

నాంది.

శా॥ శ్రీ వైకుంఠమయోధ్యయై మునిజన ♦ శ్రేణుల్బుధోత్తంసులై
యావారాసితనూజ చంద్రమతియై ♦ యాదేవతల్ భృత్యులై
యావిష్ణుండు మహీశుఁడై యిలను స ♦ త్యంబుఁ బ్రతిష్ఠించి దు
ష్టవ్రాతంబునడంచి బ్రోచిన హరి ♦ శ్చంద్రుండు మిమ్మేలుతన్.

(నాంద్యంతమున సభజూచి)ఓహో యేమి యీసభ!

((సూత్రధారుఁడు)) పుష్పాంజలియై.

సీ॥ విదితంబుగను వేద ♦ వేదాంత భావము
లజ్ఞానగోటి తుదినిడ్డ ♦ కోవిదులును
షట్ఛాస్త్రముల మహా ♦ శ్రద్ధతోఁ దిలకించి
దండిగా వాదించు ♦ పండితులును
ఆలించు వార లా ♦ హ్లాదముఁ బొందగా
గానంబు జేయుమే ♦ ల్గాయకులును
రసతతి యందలి ♦ పసమీరగా నవ్య
కావ్య నిర్మాతలౌ ♦ కవి వరులును

తే॥ గీ॥ పండి కలకలలాడు యీ • దండిసభను
జూడ పండితులైనను • గోడు పడరె
ఎటుల రంజింప వలయునో • యెరుగ మైన
నరసి యొప్పులు గ్రహియించుఁ • డార్యులార.

(పుష్పములు చల్లును.)

ఏనాటకమును ప్రదర్శించి యీ విద్వజ్జన హృదయంబుల రంజింపఁ జేయుదుమో యని ఆలోచించుచుంటిని యింకను నటిరాకయున్నది. (ప్రక్కకు జూచి) ప్రేయసీ! ఒకసారి యిటువచ్చెదవా?

నటి—(ప్రవేశించి) ఆర్యా! వచ్చితి. ఏమి సెలవు? (ముఖము పరికించి) నాథా! తావక హృదయారవిందంబున నేదోచింతయుదయించినటుల నీ ముఖ కమలంబు తెలుపకఁ దెలుపుచున్నయది.

సూ—ప్రియా! నిశ్చయమే. ఈ సభాసదుల హృదయకమలములు వికసింపజేయుటకై నాటకమును ప్రదర్శించెదమాయని యోజించ నాకేమియు తోఁచకున్నయది.

నటి—ఆర్యా! మరచితిరా?

సూ—మఱచుటకేమున్నది?

నటి—అభినవ హరిశ్చంద్రీయమనునది గలదని వెనుకఁ బ్రస్తావనవశమున మీరనలేదా?

సూ—చెలీ? చక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చితివి. నేఁడీ సభాసదుల మనంబులు రంజింపఁ జేయుటకీ నాటకరాజంబుదప్ప మఱెద్దియు గావరాదు.

నటి—నాయకా! ఆనాటక రాజంబును రచించిన మహాభాగులెవరు?

సూ—సఖీ? తెలిపెద.

సీ॥ అరయ పరోపకా • రార్థమిదంశరీ
రమ్మను నార్యోక్తి • నమ్మువాఁడు
మహిలోన బ్రాహ్మణో • మమదైవతంబను
వేదవాక్యంబులన్ • వినెడువాఁడు
సత్యమే సర్వార్థ • సాధనంబనియెడి
సాధుసమ్మతియందె • చనెడివాఁడు

నెనయు దైవాధీన • మిాజగత్తనియెడి
వాక్యంబు నేనమ్మి • వరలువాఁడు
తే॥ గీ॥ కమ్మ కులజుండు సుగుణుండు • ఘనయశుండు
నొనరఁగా చెన్నమల్లార్య • తోద్భవుండు
కమల నాభుని భక్తుఁడా • ఘడియపూడిఁ
గలఁడు మేడూరు హనుమయ్య • కవివరుండు.

నటి—నాయకా! ఇఁక నాలస్యమేల?

సూ—నాటకశిరోమణీ! ఆలస్య మేమియున్నయది. నాటకారంభమునకు ఋతువర్ణనం బావశ్యకంబు గాన నిదనుగుణంబుగా నొక ఋతువును గూర్చి నీ గానకళా ప్రవీణత్వం జూపుము.

నటి—మనోహరా! ఏఋతువును గూర్చి?

సూ—వనితామణీ! "వసంతాంత్యేన గ్రీష్మః" అను రీతిగా మన మాడఁబోవు నాటకము గ్రీష్మర్తువు ననుకరించునదైనను యిపుడు వసంతాంత్యమైనను వసంత ఋతువె గాన వసంతఋతు వర్ణనమునే సేయుము.

నటి—చిత్తము.

ఉ॥ శాంతిసమన్వితంబు శుక • శారిక సుస్వర సంయుతంబు న
శ్రాంత లతాన్వితంబు సుర • సాల రసాలయ షట్పదంబు శ్రీ
కాంత సుతప్రియంబునయి • గంధవహాన్విత శోభితంబునై
సంతత సౌఖ్యమిచ్చెడి వ • సంతము నెన్నఁదరంబె యేరికిన్॥

సూ—ఆహా! ఏమి నీ వర్ణనాచాతురి.

తే॥ గీ॥ నవరసంబుల దెచ్చి యా • నళినభవుఁడు
గుళికఁగా జేసి యిడె నీకుఁ • గూర్మితోడ
మఱియుఁ గాకున్న నిట్టి సా • మర్థ్య మెట్లు
గలిగియుండును నీకు నో! • కలికిమిన్న॥

నటి—నాథా! ఏల నన్ను పొగడెదరు? మీయొక్క సత్సాంగత్యంబువలననే నాకిట్టి సామర్థ్యంబు గలిగినది.

సూ—మగువా! మన మీా మాటల ధోరణిని ప్రకృతము మరచితిమి. అల్లదే గంట మ్రోగుచున్నది. ఇక నాటకమునకు నలయుపాత్రలను సిద్ధము చేయవలయును. పోవుదము రమ్ము.

నటి—అటులనే పోవుదము.

సూ—సఖీరత్నమా! నీవు జని ప్రస్తుత పాత్రల నాయత్తపరచుము. నే నిదే సభాసదులతో నొక మనవిఁ జేసికొని వచ్చెద.

నటి—చతురాగ్రేసరా! జాగు సేయక రమ్ము. (నిష్క్రమించును)

సూ—సదస్యులారా!

తే॥ గీ॥ దివ్యతరమైన సురసభఁ • దేరిచూచి
కౌశిక వసిష్ఠ శపథము • లలయఁగాంచి
యల హరిశ్చంద్ర సూనృత • వ్రతము నెంచి
యనృత రహితాత్ములై యుండు • డయ్యలార॥

(నిష్క్రమించును.)



# అభినవహరిశ్చంద్ర.

## ప్రథమాంకము

(స్వర్గలోకము—అమరావతీపురము)

(దేవేంద్రుఁడు, బృహస్పతి, ప్రవేశము)

దే—గురువరా!

ఉ॥ ఒక్కరు నొక్కరీతి మఱి • యొక్కరు వేరొకరీతి యందునిం
కొక్కరు నొక్కరీతి స్మృతు • లొప్పుగఁ జెప్పిరి పెక్కు రీతులన్
నిక్కము దోపదె వ్వానికి • నీకెటు లుండెనొ చూడఁజూడ నా
కక్కజ మయ్యె నీయెడ నయారె! విమర్శ యొనర్చిచూచినన్

బృ—అమరేశ్వరా!

తే॥ గీ॥ ఒప్పుగానిట్టు లెందరు • జెప్పియున్న
భావ మొక్కటి యయ్యెందు • ప్రథమ మందు
బాట లెన్నియుఁ గల్గిన • పట్టణముకు
నంత్య మునకొక్క టేదారి • యరసి చూడ.

దే—మఱచితి. పూర్వము నీతిశాస్త్రమును రచించితిరని వింటిని. అందొక వాక్యంబు కర్ణా
నందంబుగా సెలవిండు.

బృ—మంచిది. సురేశ్వరా! వినుము.

తే॥ గీ॥ భువన బంధుండు దివికిని • భూషణంబు
పుష్పఫలములె వనికిని • భూషణములు
పువ్వుఁబోండ్లకు పతిసేవ • భూషణంబు
పురుషునకు సత్య మాడుటే • భూషణంబు.

దే—మహాత్మా! పురుషునికి సత్యమే భూషణమా? మీవాక్చాతుర్యము మెచ్చఁదగి యున్నది.

బృ—వాక్చాతుర్యమేమున్నయది. ఎట్టికష్టము లొదవినను సత్యమును వీడకుండుటయే శ్రేష్టము.

దే—గురువరా! అటులైన నేను చూచిన నీతిశాస్త్రమునకును మీరురచించిన నీతిశాస్త్రమునకును భేదమున్నట్లున్నయది.

బృహ—ఆభేద మేదియో తెల్పుము.

దే—

ఉ॥ కాంతలయందు గో ద్విజులఁగాచుటయందు వి వాహమందు ప్రా
ణాంతమునందు సర్వ్వలమ•హాస్తుతి నొందెడు మానమందు ద్ర
వ్యాంతమునందు బొంక నను • వా

బృహ— నన యెచ్చట జెప్పియుండెవి
భ్రాంతికరంబు

దే— గాదు నిజ•మైనది

బృహ— యెచ్చట

దే— శుక్రనీతిలోఁ.

బృహ—సురాధినాథా! సత్యమనిన సర్వకాలసర్వావస్థలయందు సత్యము వీడని మనుజుండు, సర్వేశ్వరసముండని, వేదప్రమాణముగదా. ఇప్పుడు నీవు జెప్పిన విన్నియు సమయోచిత సంభాషణము లేగాని, మరియొకటిగాదు.

ఉ॥ ఆలిని బాసినన్ సుతుని • ప్రాణము లూడిన రాజ్యమూడినన్
జాలొనగూడియున్న కడ • జాతిలొ మాలకు సేవజేసినన్
చాలఁబరాభవంబొదవ • చావొనగూడిన సూనృతంబునం
దోలిచరించువాఁడెయిల • ను త్తము డందురు పాకశాసనా.

దే—మహాత్మా! మీరుచెప్పినటుల సూనృతవ్రతమును స్పష్టంబుగా సాగించు దిట్టలీ జగంబున నుందురా.

(సేవకుడు ప్రవేశించి) స్వర్గపురీశ్వరా! భర్గసమానులగు ఋషివర్గములు తమ సభాదుర్గమునకు వచ్చుచున్న వారలు.

దే—ఏమీ? తాపసోత్తములు వచ్చుచున్నవారలా? వారలనిటకు శీఘ్రముగా దోడ్కొనిరమ్ము. పొమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

(వసిష్ఠ, వామదేవ, కశ్యప, అత్రి, గౌతమ, అగస్త్య, భృగు, విశ్వామిత్రులు ప్రవేశింతురు)

దే—(ఎదురుగాఁజని బద్ధాంజలియై) తాపసేంద్రులారా!

సీ॥ మూఁటి రెంటికిమధ్య • ముదముతోఁగూర్చుండి
మురహరు జపియించు • ముఖ్యులార
ప్రాఁబల్కులెల్లను • పఠనమందిరములై
ప్రౌఢికెక్కుసనాథ • నాథ్యులార
స్నానాద్యనుష్ఠాన • సత్కర్మలనిశంబు
సల్పుచుండెడు మహా • సాధులార
విధివిరామము లేక • వేదాంత సారము
కొనగోటనిడు మానిజనములార
తే॥ గీ॥ తరణి సమతేజులైనయో • తపసులార
దివ్య చక్షువులనుగల్గు • భవ్యులార
మూఁడు జగముల దిరుగాడు • ముఖ్యులార
మ్రొక్కుచున్నాఁడు సురపతి • మోదమలర.

మునులు—(అందరు) సన్మంగళాని భవంతు.

దే—ఋషివర్యులారా! మీయసాధారణదివ్యమంగళవిగ్రహములు మానయన గోచరంబులగుటంజేసి, మజ్జన్మసార్థకతంజెందె; మాననీయులారా! నేనమ ర్పించు నర్ఘ్యశ్రీంబులంగైకొని మీకై యుంపఁబడిన యీ యుచితాసనంబు లలంకరింపుఁడు.

మునులు—(అందరు నాసీనులగుదురు)

నారదుఁడు—(ప్రవేశించి) పొట్ట తడవుకొనుచు.

ఉ॥ అందముగాను నాకు కల • హాస్పదమై తనరారుతావు నే
నెందునుగానఁగన్ విసివి • నేఁడిటు లీసురరాజధాని కిం
పొందగ వచ్చినాడ నిట • నొప్పుగ నాయుదరాగ్ని చల్లనౌ
మందిట గల్గునో కలుగు • ప్రాప్తమదెట్టుల నున్నదోయికన్.

ఆహా! ఏమి; యీస్వర్గవైభవము నెల్లప్పుడుగాంచు నాకే విభ్రమముగొలుపుచుండ నూతనాగంతుకులమాటఁ జెప్పగలయునా? లోకములోనిజనులందరు మేకపోతుల మూతులుబిగించి, మారణహోమముచేసి యజ్ఞయాగాదులు జేయుటకే స్వర్గలోక భోగంబులందుటకే గదా.

సీ॥ అందమై సురలకా • నందమై నవరస
బృందమై చెలగుసీ • నందనంబు
వాసియై మునిజనో • ల్లాసియై సుజనసం
వాసియైవెలయునా • కౌకసంగ
స్వేచ్ఛలై రూపని ర్వ్యాచ్యలై • సతతభో
గేచ్ఛలై వెలయువి • యచ్చరాళి
జ్ఞానులైమిన్నేట • స్నానులై బుధజన
మాన్యులై నివసించు • మానివరుఁలు
తే॥ గీ॥ మణిమయాంచితమైనట్టి • మందిరములు
భోగముల నందుచున్నట్టి • పుణ్యవరులు
చూపరులకతి చిత్రమౌ • సుందరములు
నానసుమలతావి సురల ది • వాణసీవి.

దే—(లేచి) గానవిద్యా విశారదా! అకలుషితాంతరంగా! నమస్కారములు.

నా—శ్రీహరాభి వృద్ధియగుఁగాక.

దే—తాపసోత్తమా! ఈ పీఠం బలంకరింపుఁడు.

నా—(కూర్చుండి తనలో) ఓహో! నేఁడేమి యీ సురసభ నిండి నిబిడీకృతంబై సత్యలోకంబుగా మారియున్నది. (అని ఆలోచించుచూ తలయూపును)

బృ—శచీపతీ! నిసందేహం బీసంయమీంద్రులవలన దీర్చుకొనుము.

దే—చిత్తము. అడిగిచూచెద. ఓఋషివర్యులారా!

సీ॥ వరసుమనోభవ్య • వాగ్విశేషంబుల
వరలుచుండెడుమహాని • వర్యులార
శౌరినామామృత • సారంబుగ్రోలుచు
ధర జరియించెడి • తపసులార
సంతతానంత ని • ష్టాంతరంగులునైన
పతితపావనులార • పారులార
జపతపాధ్యయనాది • షట్కర్మనిరతులై
నిరశన వ్రతదీక్ష • నియతులార
తే॥ గీ॥ వేదముల్ శాస్త్రములునైదు • యేదునొకటి
తల్లక్రిందుగ జదివిన • ధన్యులార
మూడు జగముల దిరుగాడు • ముఖ్యులార
సూనృతోత్తము నెట్టైన • జూచినారి?

మునులు—(ఒకరిమొగమొకరు జూచుచుందురు)

బృ—(మనలో) ఆహా! ఏమి ఈమునులెల్లరు వెల్లముకొట్టిన రాళ్లవలెనున్నవారలు.

సీ॥ మూడులోకంబుల • మొదలంటగాజూచు
నారదమౌనీంద్ర • నయధురీణ!
స్రష్టసృష్టికిబ్రతి • సృష్టి జేసినుతిగ
గాంచినగుణశాలి • గాధిపుత్ర!
మూడుమూర్తులనీదు • ముద్దుబిడ్డలజేసి
యత్రిప్రేమబెంచిన • యత్రిమౌని!
విఱ్ఱవీగుచునుండు • వింధ్యాద్రినలయించి
దంభమార్చినకుంభ • సంభవుండ
తే॥ గీ॥ కశ్యప! వసిష్ట! గౌతమా! • కలలనైన
భాంక నటువంటివాడల • భూమియందు

అపరాధమైన ని • రపరాధుఁడ నటంచు
శరణుజొచ్చినవాని • జంపబోఁడు
తనవారు పెరవార • లను భేదముంచక
సమదృష్టిఁ జూపెడి • సజ్జనుండు
తే॥ గీ॥ చక్రవర్తుల ప్రథమైక • చక్రవర్తి
నాదు శిష్యుఁడు సాకేత • నగరవర్తి
భవ్యగుణముల నొప్పెడు • దివ్యమూర్తి
సత్యకీర్తి హరిశ్చంద్ర • చక్రవర్తి॥

త్రైలోక్యనాథా! ఈ భూపాలుఁడు త్రిశంకు నృపాలుని కొమరుఁడు; ప్రాణసంకటములయందుఁ గూడ బొంకుబోలు నసత్యశబ్దం బెన్నఁడును లేదు. ఇదిగాక సంక్షేపముగ విషయముఁ జెప్పెద.

తే॥ గీ॥ పసితనంబున బడిలోన • బాఠములను
జదువువేళల లేదను • శబ్దసరణి
వచ్చియుండిన నోటరా • వచ్చుగాని
ఆడియెరుగఁడు నోట లే • దనెడిమాట॥

విశ్వా—(స్వగతము) ఈ వసిష్ఠుండు చెప్పినట్టుల ఈ ధరావల్లభుఁడు సత్యవాదియే; అయినను నా యనుగ్రహీతునకును నాకును గల బద్ధవైరంబునుబట్టి యీతని సిద్ధాంతంబు పూర్వపక్షంబుగా వాదించెద. (ప్రకాశముగా) ఓరీ వసిష్ఠా! నీ వెవ్వరినో సత్యకీర్తియని పొగడుచుంటివి. మా మేటి మాటలతోఁ గలిసిబడి స్పష్టంబుగా వినమైతిమి. ఇంకొకసారి చెప్పుము.

వసి— ఒకసారియేమి? కలుషహరంబగునట్టుల ననేకసారులు చెప్పెద. అయోధ్యా పురాధినాథుండగు హరిశ్చంద్రుఁడు! హరిశ్చంద్రుఁడు! హరిశ్చంద్రుఁడు!

విశ్వా—ఏమీ! పడిమీఁద లన్నముమాడదరా? అతనియింట పురోహితత్వంబు జేయుచు పొట్టఁబోసికొనుచున్నందుకా యీ హరిశ్చంద్రుని యీ త్రివిష్టపాధిపుని యెదుట బట్టినట్లెఁ బొగడుట? ఈ త్రివిష్టపాధిపత్యమైనను నీ సభవారి నందఱిని యడిగినఁగాని పొట్టను కొట్టుకయుండఁబట్టి నిన్నొక్కని నేనేరంట మునపు చెప్పినా యేమి?

సీ॥ జలరాసులేడు ని • ర్జలరాసులుగ జేయు
కుంభసంభవుఁ డిట • గూరుచుండ
అమరాసురులకెల్ల • నయ్యగా బరగిన
కశ్యపముని యిటఁ • గనుచునుండ
ఎల్లలోకంబుల • నల్లలనాడించు
భృగుభరద్వాజాత్రి • ఋషులునుండ
రేబవల్ నడిపించు • రేరాజు దినరాజు
లింపుగా దివి బర్వ • లిడుచునుండ
తే॥ గీ॥ సృష్టికర్తను నేనుండ • సురలునుండ
వేయికన్నుల దొరయుండ • విబుధులుండ
ఇందరనుపేడి యెవనినో • యజ్ఞతనఁపు
మానవాధము నిటు దెచ్చి • సూనృతుఁడని
చెప్ప నోరెటులాడెనో • చెడు వసిష్ఠ॥

ముదిమిచే మది నిలకడలేక యీ మహోన్నతులైన మహీపతులు కల్లలాడని జెప్పుట నామదికొక వింతగా నున్నది. చాలిక నోరుమూయుము.

వసి—ఓయీ పరనిందాపరాయణా! పాపీ! నీవెప్పుడును పరుల కలిమిని జూచి యోర్చువాడవుగావు. ఎన్నడయిన నీవదనగనే గాటికి కట్టివేయుమనున దెట్టి ధర్మము. సత్యమూర్తియని లోకములో కీర్తిగాంచిన యీ హరిశ్చంద్రచక్రవర్తిని నీచునిగాఁ బరిగణించుట నీకు తగదు.

విశ్వా—ఓరి వశిష్ఠా! దర్భపోచల నొకకొన్ని చేతబట్టుకొని వీసెఁడు విభూతి నొడలి నిండుగఁబులుముకొని, చాలిచాలని యొకయంగవస్త్రము ధరించి యొకపాత్రి పంచాంగంబు చేతఁబుచ్చుకొని జనపనారవలెఁ బెరిగిన నీపల్లగడ్డము నూగులాడించుచు, స్వస్తులయిచ్చుచు తోఁచినయట్లెల్ల స్వస్తివాచకంబులం జెప్పి పొట్టబోసుకొను నీకు రాజ్యపట్టభద్రుల సంగతి తెలియునెట్లు? చిన్ననాటినుండియు నీలోకములనేలు ప్రభువులగువారల నెఱుఁగఁ గాచివడియఁబోసినవాఁడనగు నాకు గాక నీకెట్లు తెలియునవకాశము గలదు?

సీ॥ ఎక్కువపన్నుల • నెక్కువేసియు బక్క
రైతుల నేడ్పించు • పాతకులును

సారుగుల్కు వాలుపారు ◆ సారకాంతలగూడి
చరియించుచుండెడి ◆ దురితమతులు
జూదంబులను దుర్వి ◆ వాదంబులను జాతి
భేదంబులనుగల్గు ◆ భీరువులును
బాణంబులను మృగ ◆ ప్రాణంబు లనిశంబు
దీయుచు నుదరంబు ◆ కేయువారు
తే॥ గీ॥ వరువు మర్యాదలనవారి ◆ కెరుక లేదు
న్యాయమన్యాయ మిదియని ◆ రోయ లేరు
పరుల సిరుగోరుదురువారి ◆ సిరినెవరు
నీచులనమించి జరియించు ◆ రాచ జాతి.

వసి—(తనలో) ఓహో! నేనూరకున్న కొలది వీనికారులంతకంతకు మిక్కుటంబగు చున్నయవి. ఇక నేనూరకుండగూడదు. (ప్రకాశముగా) ఓరీ! దుష్టపాత్రా విశ్వామిత్రా! తద్వంశంబున జనించియు కులాభిమానం బిసుమంతయు లేక తద్వంశంబునే దూరుచుంటివా. దుర్మార్గా!

విశ్వా—దుష్టాత్మా! నిష్పక్షపాతులమగు మాకీపక్షపాతంబు లెందులకు?

వసి—అరరే! మీరునిష్పక్షపాతులా! నిష్పక్షపాతులైన నిట్లాక్షేపించు టెందులకు

విశ్వా—ఎందులకా! క్రిందుమీదెరుంగక అధమాధములగు రాజాధములదెచ్చియీ తాపసేంద్రులయెదుట నధికముగా బలికినందులకు

వసి—విశ్వామిత్రా! లోకమునంగల రాజాధములవలె నమ్మహారాజు నెన్నంబోకుము

విశ్వా—ఓరేదుష్టా! మాటిమాటికి బట్టువలె పొగడెదవిటనమ్ముదురనియాయేమి? ఇకనీవృథాప్రసంగము నటుగట్టిపెట్టుము. భ్రష్టా! పాపిష్టా! వసిష్టా!

వసి—ఓరే అపాత్రా! సూనృతులుగాని వారిని బొగడిన తప్పుగాని సూనృతులైన వారిని బొగడిన లోపమేమున్నయది? అందులోవీరలెక్కువ రొక్కములిచ్చు వారి కక్కురలుదీర్చు రొక్కకామినులగూడి తపోవిఘ్నులైన విశ్వామిత్రులు గారు, పాపాత్మా!

విశ్వా—(తనలో) ఓహో! నాగుట్టంతయు బయటపెట్టుచున్నవాడే; ఇక నేనూరకుండగూడదు. వీని గుట్టంతయు బయటపెట్టి వీనినోటికి తాళమువేసెద.

(ప్రకాశముగా) దిక్పాలులారా!! అఖిలాగమపారాయణులగు యోగులారా! వినుఁడు, వినుఁడు.

సీ॥ పతియందు రతిలేని • సతులను బ్రతిమాలి
గర్భముల్ సేసిన • ఘనుఁడు వీఁడు
మానాభిమానము • ల్మానిజరించెడి
వెలయాలి సుతుఁడున్న • వెలసి నాఁడు
పిత్రువాస రమ్మని • బిల్వ శిష్యునియింట
మనుజమాంసముదిన్న • దనుజుఁ డితఁడు
అపరాధుఁ డగుశిష్యు • శపియించి వానిచే
బ్రతిశాప మునుగొన్న • పాపి యితఁడు
తే॥ గీ॥ గురువునకెయిన్ని దోషము • ల్బొరయు చుండ
శిష్యు నకునెట్లు సూనృత • సిద్ధి గల్గు
తల్లి జారిణీ వృత్తిలోఁ • దనరు చుండ
కూతు రెబ్భంగి విటులను • గోర కుండు?

నీచరాజాభిమానీ! నీచవారకాంతాతనూజ! నీచమనుజ! మాంసభక్షక! నీచండాలోపదేశగురుండగుదిరా! చాలుఁజాలు. రాజవంశంబున జనించి, రాజధర్మముల కాచికాచి, విడియగట్టిన, నాయందేనా నిందనుపులు? నీచా! పరమపిశాచా!

నార—(తనలో) నేటికిఁగదా నేనాటిన, కలహబీజములు గొప్పశాఖలతో వృద్ధిఁగాంచినది. (అని పొట్టపిడచి తెరిప్పుచు) ఇప్పటికిఁ గోపాయుధాగ్ని దల్లారినది; ఇక వీరిని వొంకరింతుననియొకరును వొంచెదననియొకరును ప్రతిజ్ఞల జేయునట్లు, మరికొంత్పెద (ప్రకాశముగా,) తాపసేంద్రులారా! ఈ సురసభలో నాహరిశ్చంద్రుండు సత్యవాది అవుననియు కాదనియు వాదించిననేమి ప్రయోజనము! విశ్వామిత్రా! నేనగునేను నివారకరేందుల్ని నన్నుసమాధానపరచెదము. ఏల యీ వృథాకలహోష?

విశ్వా—(తనలో) ఈ నారదుండుగూడ నన్ను తిట్టెడుచున్నవాఁడే; ఇక నూరకుండుట పాడిగాదు. (ప్రకాశముగా) ఒరే వసిష్ఠా! నేనాభూనాథుని బొంకించెద.

హరి.—అయిలపతిని కల్లలాడింపఁ జేయ నీవు కాదుగదా; నన్ను సృజించిన యానలువ మొగంబులుగల నలువకైనను నలవిగాదు. ఏల యీగోల బొల్లులు, నరకావవు గులువా?

సీ॥ కులగిరుల్ చలియించి • కలతనొంది నగాని
 అనృతంబు లాడఁడా • యవని విభుఁడు
ఉడుగణాళి చలించి • పుడమి రాలిన గాని
 అనృతంబు లాడఁడా • యవని విభుఁడు
ఏడువార్ధులనీరు • లింగిపోయిన గాని
 అనృతంబు లాడఁడా • యవని విభుఁడు
గ్రహపతి సోముండు • గతులు దప్పిన గాని
 అనృతంబు లాడఁడా • యవని విభుఁడు
తే॥ గీ॥ ధరణి గ్రుంగిన మిన్ను పై • నొరిగి పడిన
 సకల సంపద లుడిగెడు • సమయ మైన
 అసువు లంత్యంబు లైచను • యపుడు నైన
 అనృత మనుమాట బల్కఁడా • యవని విభుఁడు.

ఒక వేళ అవనీనాథుఁడు అనృతంబు లాడెనేని, హరిశ్చంద్రుని ప్రతిజ్ఞ వినుము.

తే॥ గీ॥ అవని నాథుండు అనృతంబు • లాడె నేని
 బోడి తలగాను జంధ్యంబు • లూడ దీసి
 ధరణిదేవత్వమును బోవ • ఖరము నెక్కి
 యామ్య దిశ కేగెద నుమీర • లరయు చుండ.

విశ్వా.—ఓహో నారదమహర్షీ! అవనీనాథుని ఆంకించుట నెఱుంగవా? వినుము.

ఆ॥ వె॥ సంకటముల గూర్చి • సంపద లోర్చి కాల్చి
 ఆలి నొక్కనికిని • యమ్మఁ జేసి
 చేర రాని వాని • సేవకు గాఁజేసి
 పుత్రు ప్రాణ ముడిపి • బొంక జేతు.

అప్పటికైనను, అనృతమాడఁడేని, అస్మచ్ఛపథంబు, వినుము.

సీ॥ శ్రద్ధతో మునుమున్ను • సిద్ధాశ్రమంబున
 నార్జించు పుణ్యమం • దర్ధ మిత్తు

మన్వంతరంబులు • మరి పదునాలుగు
నస్మత్ప్ర దంబున • నాథు జేతు
శుభమంచు దిక్పతు • లభినుతుల్ సేయంగ
త్రిభువనం బులకెల్ల • ప్రభువు జేతు
సతతంబు హరికథా • మృతముగ్రో లగఁజేసి
పరగనంతమునన • త్పదము నిత్తు
తే॥ గీ॥ కలగి జలనిధు లిలనెల్ల • వలస గొనిన
దిగ్గ జంబులు నటునిటు • మ్రొగ్గటిలిన
సూర్య చంద్రులు గతితప్పి • స్రుక్కటిలిన
నన్న మాటను చెల్లింతు • నార్యులార

(తనలో) ఈబడుగు తపసి ఆపుడమిఱేఁ డనృతవాదుఁడని బండబగుల ప్రతిజ్ఞ జేసియున్నవాఁడు. ఈజడలదారి యెప్పుడైనను కడునమ్రిక లేనిదే దుడుకు పడి వృథాకలహములకు వచ్చువాఁడుగాఁడు. చూడగా నాపుడమి పాలుండు రూఢిగా నిత్యసత్య వ్రతాచరణుఁడై యుండవచ్చును. అకటా! నేనొడ లెరుంగక మగహంకారము చే గడుసు మాటలాడితిని. ఇప్పుడేమి సేయుదును? ఉండిన వాని నుండ లేక నొక పెద్ద బండ నెత్తినవేసికొంటిని. (కొంచె మాలోచించి) ఇప్పుడడలు జెందిన నేమిప్రయోజనము? ఇక నెటులనైన బడుపాటులంబడి ఆపుడమిఱేఁ ననృతవాదిం జేయవలయునుగదా! (ప్రకాశముగా) అరుంధతీశ! ఎట్లోశపథంబు జేసితివి; ఈవృద్ధాప్యమున అనర్థదాయకమైన యవమాన మెచ్చు చేమోయని యిపుడు బెంగపెట్టుకొనిన సార్థకత లేదు. నేనిదే పోయి వచ్చెద! నీవేమైన నాపుడమిఱేఁ నడిగికొనవలయునేమో కడువడింబొమ్ము.

వసి—విశ్వామిత్రా! ఆవసుంధరాధిపతిని,వసుంధరయందు సృజించునాఁడే సరసీరుహాసంభవుండు, సత్యనిష్ఠయు, ధృతియు సహాయముగా, నాతనికి, భృత్యులఁజేసినాఁడు. నాకొంచింతయేమియు లేదు. ముందు నిశ్చయముగా నీకుసంభవింపనున్న పరాభవముంగూర్చి నీవేమైన నాలోచించుకొనవలయు నేని ఆలోచించుకొనుము.

దే—(లేచి) నారదమహామునీంద్రా!

సీ॥ సూనృత వ్రతమున • చొక్కంబుగ జరించు
నతఁడెవ్వఁడని గురు • నడుగ నేల
అడిగిన యంతనే • వడిగా వశిష్ఠుండు
శిష్యు హరిశ్చంద్రు • జెప్ప నేల
చెప్పిన యంతనే • చెలరేగి మండుచు
యీగాధిసుతుడిట్లు • యెంచ నేల
యెంచియంతటమది • మంచిగా నుండక
నెంచి ప్రతిజ్ఞల • బెంచ నేల
తే॥ గీ॥ పట్టిముక్కోపి యీగాధి • పట్టి జూడ
నా హరిశ్చంద్రు బీచంబు • నడచునింక
నింతకును కారణంబెంచ • నేనుగాదె
దైవకృతమును దప్పింప • తరముగాదు.

అప్పుడాపులు పోట్లాడి లేగలకాళ్ళు విరుగద్రొక్కినరీతిగా, వీరికలహమున నా భూకాంతునకెట్టి యిక్కట్లు మూడనున్నవో కదా? ఈ విశ్వామిత్రుండు త్రినేత్రునేత్రానలుండై తేజరిల్లుచున్నవాడు. మీరలెట్లైన వానిని శాంతస్వరూపులఁజేయుడు.

నా—ఓయి విశ్వామిత్రా! ఈ సురపతి మీదుర్భరతేజంబు జూడంజాలక శాంతమూర్తులఁగమ్మని వేడుకొనుచున్నవాడు.

విశ్వా—ఎట్లా! ఎట్లా! శాంతిమూర్తిని జేయవేనుచున్నాడా!

తే॥ గీ॥ ఆలి బొందిన వానినే • మనగలేక
నూరకుండిన యలగాత • ముండగాను
కొక్కొరోయంచు గూసెడి • కోడిగాను
కోప ముపసంహరించెసి • కోవిదుండ.

గాత—ఓహో! నాసుట్టంతయు బట్టబయలు జేసినాడే. ఇక నేనెట్టుల వీరితో తలయెత్తగలను. (అని నిష్క్రమించును)

దే—(లేచి) గాధినందనా! యుష్మత్కోపానల జ్వాలల కాత్రిమూర్తులైన నిల్వజాలరు! నేనెంతవాడను. తెలిసి తెలియక పలికినపలుకులు క్షమించి నాకలవరంబెడబాపుడు. (అని నమస్కరించును)

విశ్వా—అమరేశ్వరా! మన్నించితి లెమ్ము.

(జనులందరు నొకరివెంటనొకరు పోవుదురు)

వసి—ఇక నిప్పాపాత్ముని ముఖంబు జూడరాదు. (అనినిష్క్రమించును)

నార—(గంతులువేయుచు) ఇక నాకోరిక కొనసాగినది. నాప్రయత్నమిక నక్కరలేదు. (అని నిష్క్రమించును)

విశ్వా—(తనలో) ఇక నీకార్యంబునకు గావలయు నుపకరణంబు లెన్నియో గావలసి యున్నయవి! నే నేగి వాటినన్నిటిని సమకూర్చుకొనియెద. ఇట వృథా కాలయాపనమేల. (అని నిష్క్రమించును)

దే—గురువరా! నేడీసభ చాలింతము. (అని నిష్క్రమించును)

అభినవ హారిశ్చంద్రీయము.

(ప్రథమాంకము.)

(సంపూర్ణము.)





# అభినవహరిశ్చంద్ర.

## ద్వితీయాంకము.

(హరిశ్చంద్రుడు, మంత్రియు ప్రవేశింతురు)

హరి— సచివోత్తమా! రాజ్యభారం బమితకష్టముకదా!

సీ॥ చోద్యమై విపుల సం • వేద్యమై శత్రుదు
ర్భేద్యమై చెలగు బ • లీఁడులున్న
పూజ్యమై బహుభోగ • భోజ్యమై సతత స్వా
రాజ్యమైతనరు సా • మ్రాజ్యమున్న
శూరులై భుజబలో • దారులై రణజయో
ద్ధీరులై తగుపరి • వార మున్న
మంత్రులై సర్వజ్ఞ • తంత్రులై బుద్ధి భా
స్వంతులై యొసగు సు • మంత్రులున్న
తే॥ గీ॥ శాంతి సత్యదయాశౌచ • సరణి ప్రజల
యిక్కటులఁబాపి సుఖముగా • నేలకున్న
యన్నియునుగల్గి సార్థక్య • మేమి పతికి
అడవిగాచిన వెన్నెల • లట్టి వన్ని

మంత్రి— తే॥ గీ॥ అనృత రహితు డటంచు నీ • యవనిలోన
పేరు గాంచియు ప్రజలకు • మేలు గలుగ

పాలనము సేయుచునునుండ • బోలు పతికి
నరయ రాజానుమతిధర్మ • మసెడు రీతి॥

హరి—మంత్రిసత్తమా!

ఉ॥ విప్రవరుల్విలాసముగ • వేదముల్ పఠియించుచుందురే
యప్రతిమాన శౌర్యసము • పార్జన వంతులై క్షత్రియోత్తముల్
కుప్పలుగా ధనంబులను • గూర్చెడి కోమటు లుందురే కృషిన్
తప్పక స్వీయవృత్తులను • దన్పుచు నుందురె శూద్రసత్తముల్॥

మంత్రి—రాజచంద్రమా!

సీ॥ వేదంబుల రవంబు • విదితంబుగ నయంబు
స్తోత్రంబులపఠించు • ధాత్రి సురులు
అరిరాజ ఘనరాజి • శరరాజముల తేజ
ములగాఁజ వడజేయు • భూపవరులు
ధనమొప్ప నలకూబరుని కప్పు లిడఁ రొప్పు
వలనొప్ప నేర్పు తైరి • వర్ణికులును
దిట్టంబుగను కొల్చు మెట్ట లా • కసమంట
సుఖపాటి యగుమేటి • శూద్రకోటి
తే॥ గీ॥ కామ కళచాతురిని ఘన • కలిత లగుచు
వరలుచును నుందు రెప్పుడా • వారసతులు
కొరత లిసుమంత యైనను • బొరయకుండ
పూజ్యముగనున్నదీ మన • రాజ్యమెల్ల॥

రాజేంద్రా! మనరాజ్యమందెచ్చటను క్షామబాధలులేక, ప్రజలందరు నిరంతరానందాబ్ధియందెడ సందులేక మునుంగుచు తమ స్వీయవృత్తులయందతి జాగరూకతతో మెలఁగుచున్నవారలు.

సేవకుడు—(ప్రవేశించి) విశ్వంభరాభరణా! విశ్వామిత్ర మునీంద్రులవారు వచ్చి ద్వారముకడ వేచియున్నవారలు.

హరి—వారి నిటకు శీఘ్రముగా దోడ్కొనిరమ్ము.

సేవ—(నిష్క్రమించును.)

విశ్వా—(ప్రవేశించును.)

హరి— (ఎదురుగాజని) తాపసేంద్రా! నమస్కారములు.

విశ్వా—చిరాయురుపేతుడవుగమ్ము.

హరి—మౌనిచంద్రమా! ఈ మణిమయాసనమున వసింపుడు.

విశ్వా—తే॥ గీ॥ జరుపుదురె దేవ భూదేవ • సంస్తుతులును
పాడి పంటలు గల్గునే • పాలనమున
మంగళమె బంధువులకు సా • మంతులకును
శుభముగల్గ నుందురే • సుతులు సతులు
నాజ్ఞమీఱక యుందురే • నాప్తవరులు.

హరి—చం॥ మునివర! త్వత్కటాక్షమున • పూర్ణసుఖంబులుగల్గె! దర్శనం
బున దురితౌఘమున్ సమసె • పూజ్యతనొందెను జన్మమెల్ల నీ
వనవరతానురక్తి నను • వర్ధిలజేయగ వచ్చినాడ వీ
దినము శుభంబుగాదె భవదీయమహాత్మ్యమెరుంగ శక్యమే.

విశ్వా—రాజా! నేనొక స్వల్పకార్యార్థుడనై వచ్చితిని. అయ్యది నెరవేర్పజాలుదేని తెలిపెద.

హరి—తాపసోత్తమా! తమవాంఛితం బెట్టిదియైనను దీర్చెద. ఆనతిండు.

విశ్వా—(తనలో) ఆహా! ఏమి? ఈధారుణీశ్వరుని దాతృత్వము. నేనడిగి యడుగక మునుపే నీవాంఛిత మెట్టిదియైనను దీర్చెదనని చెప్పుచున్నవాడు. సత్యకీర్తిగల యీ హరిశ్చంద్రచక్రవర్తిని ఏనెటుల యిక్కట్టులపాలు జేయుదు? చేయకున్న నాప్రతిన నెరవేరు టెట్లు? (ఆలోచించి) ఎట్లైనను నేనీపని నెరవేర్పకున్న సాటిఋషులలో చౌకనగుదు. అయిన నిప్పుడు వీనిరాజ్యంబు గోరుదునా! కోరి తదుపరి నేజేయవలసిన పనియేమి! (మిన్నుజూచి) కాదు. కాదు. పొరబడితిని. ఇపుడే వీనిరాజ్యము గోరిన వెగటుగా నుండును. ఇది సమంజసముగాదు. అయిన నొకయుక్తి దోచుచున్నయది. ఏమన: జన్నము సేయు నెపంబున, కొంతధనంబు గోరి అధనంబు వీనితావున నేయుంచి, నా యాశ్రమంబునకుజని, కొన్ని ఘాతుక మృగంబుల సృజించి, పంటపైరుల జెరుపనంపిన వాటిని సంహరింప, నితం డరణ్యములకు వేటకై వచ్చును. అపుడీతని మనసు కలవరపరచి, చూపరులకు మిరు

మిట్టుగొలుపు పసిమిపస్నెగల, మిసమిసలాడు, కురంగంబు నొకదానిసృజించి వీనికడకంపి దానిని తరుమ జేసెద అప్పుడైన నితనితో విరోధముసంభవింప దేని కొందర మతంగాంగనలసృజించి వారలమిషచే రాజ్యముగైకొని యిప్పు డడుగు ధనంబు అప్పుగాబెట్టి, ఆడవులకంపి, యిడుములు గుడువజేసెద.
అప్పటికైన నసృతమాడడేని తదుపరి జూచెదగాక

హరి—మౌనిసత్తమా! ఏమట్లు సంశయించెదరు?

విశ్వా—మానవాధిపా? నూనృత వ్రతపరాయణుండవని సకలలోకంబున సన్నుతిం గాంచిన నిన్నడుగ సందియంబేమిటికి?

హరి—ఉ॥ రాజ్యములైన ధాన్యధన • రాసులనైన పురంబులైన
సామ్రాజ్యములైన సద్వసన • పుంజములైన రథంబులైన స
ద్భోజ్యములైన రమ్యమణి • భూషలనైన పురంబులైన సా
మ్రాజ్యమునైననిత్తు మునిరాజ ముదంబున గోరుమెద్దియో.

విశ్వా—భూపాలా! శుష్కపవాసులమై విపినంబున తపంబులుసల్పు తాప సేంద్రుల కీ సంపదలెందులకు? నాతలంపు తెలిపెద నాలింపుము.

హరి—చిత్తము ఆదియెట్టిదియో, ఆనతిండు.

విశ్వా—నేనొక జన్నంబుసేయ నెంచి దానికి వలయుధనంబు న్నడుగవచ్చితి

హరి—ఆజన్నంబునకు ధనంబెంత గావలయును?

విశ్వా—మానవేంద్రా? ఒక్క మనుజుండు యేనుగునెక్కి నిక్కి, రత్నంబొక్కటాక సమునకెగురవేసిన నది యెంతయెత్తుననో అంతయెత్తు ధనంబు వలసి యున్నది

హరి—తే॥ గీ॥ మౌని చంద్రమ సంకోచ • మంద నేల
తమరి కోర్కెను దీర్పసా • ర్థకత గనమె
పాత్ర మెరిగియు దానంబు • క్షేత్ర మెరిగి
విత్తనంబును జల్లగా • వృద్ధి గాంచు

విశ్వా—మనుజాధీశా! వివినయవివేక సౌశీల్యాది గుణంబులకు నామనంబు మితానందంబు నొందినది. ఈధనంబు నీతావుననే యుంచుము నేజన్నంబు తలపెట్టునపుడు గొనిపోయెద

హరి—తాపసేంద్రా! దయాసాంద్రా!

చం॥ తనువు లశాశ్వతంబు లని • తాదలినుండియు నిట్లువల్కఁగా
ఘన తగునయ్య; నాకు కల • కాలము సంపద లుండు నయ్య; వీ
ధనమని పేరుబెట్టిచట • దాచిన యిత్తుమె యివ్వలేమొకో
యనియెడి సందియంబు మన • మారడిబెట్టుచునున్నదీయెడన్

విశ్వా—ధరణీశా! గాచుటకు తగినంతవసతి లేకగదా, నీతావున నేయుంచుమనుట.

ఉ॥ నట్టడవుల్నిరంతరము • పట్టుగ నాకులు వేరువెల్లకుల్
పొట్టకు పట్టినన్ని దిని • పుట్టల చాటునొ చెట్లచాటునో
గుట్టల చాటునో కనులు • గూర్కి తపంబులు సల్పు మాకటన్
పెట్టెలె? పేడలా? ధనము • బెట్టగ తావట లేదుభూవరా.

హరి—తాపసేంద్రా! మీకర్పించిన ద్రవ్యంబు నాకడనుంచుమను టదేటిధర్మము? పోనీ, మీయాశ్రమమున నుంచుటకు సంశయంబుగానున్న మీకెక్కడ మిక్కిలినమ్మికగలదో అక్కడయుంచుడు.

విశ్వా—అటులనా? నాయందే నమ్మకము. ఉంచెదవా? లేదా?

హరి—చిత్తము, మీయాజ్ఞనుల్లంఘింతునా?

విశ్వా—(తనలో) ఆహా! ఈతని మనఃపటిమ చూడ నాయాటలిట సాగునటుల గనుపించదు. అయిన నాచేతనయినంతవరకు చూచిగదా విడువవలసినది. (ప్రకాశముగా) రాజా! సంకోచమందకుము. నేబోయి వచ్చెద.

(నిష్క్రమించును.)

హరి—మంత్రివర్యా! నేనెంత బ్రతిమాలికొనినను సుంతయైనను చెవిబెట్టక విశ్వామిత్రుడు ద్రవ్యమంతయు నాచెంతనే యుంచిపోయెగదా!

మంత్రి—భూపాలా! ఏల ఇట్లధైర్యపడెదరు? ఇంతకొద్దిమాత్రము నెప్పుడడిగిన నప్పుడీయ లేమనియా?

సేవ—(ప్రవేశించి) రాజేంద్రా! మనరాజ్యంబున గలుగు ప్రజలందరు తమదర్శనార్థమై ద్వారముకడ వేచియున్నారు.

హరి—వారిని నిరాతంకముగ రమ్మనుము.

సేవ—(నిష్క్రమించును.)

రయితులు—(ప్రవేశించి) సాహూరికి, దండాలు, దండాలు.

హరి—తే॥ గీ॥ ఆయురారోగ్య పుత్రపౌ • త్రాభివృద్ధి
గల్గియుందురె యైశ్వర్య • కరముగాను
ధర్మమిలనాల్గు పదముల • దనరుచుండ
నాపదలు బొందకుందురా • కాపులార.

రైతులారా! సుఖంబుగా నున్నవారలా?

రైతు—ప్రభోరికి మాసుగాలు ఏమని విన్నవింతుము.

హరి—(ఆతురముతో) ఏమి? మీకంతకష్టము లొచ్చెనా? అవియేవియో

రైతు—తే॥ గీ॥ పుడమిపాలక వినుము మా • యిడుములెల్ల
కారుమెకములు చెలరేగి • పైరులెల్ల
పాడుజేయుచు మాపైన • బడుచుచుండె
నుడజాలము మేమునీ • యుర్వియందు.

పంటపైరులన్నియు మొదలంటమేసి మెకములు మావెంటబడినవి. మేమెట్లు బ్రతుకగలము?

హరి—ఏమిది?

తే॥ గీ॥ కావులేక నధర్మంబు • ధరణిపైడ
ధర్మమీయిల నాల్గుపా • దములనాడ
వీనులను విపరీతము • ల్వినుటదేడ
యేలుబడినాకు ధరలోన • నిలుచుటెడ.

ఈజాడజాడ ముందేవియో యిడుము లొదవునటుల దోచుచున్నది. అయిన నేమిసేయుదము. దైవమున్నాడుగదా? (ప్రకాశముగా) కాపులారా! మీరింక్లష్టపడకుడు. నేనతిత్వరితగమనంబునఁ జని యాక్రూరమృగ మారణము జేసెద.

రైతు—మహాప్రభో! వాటిని సంహారము చేస్తేగాని మేము బతుకజాలము.

ఉ॥ పండినపంట చేలబడి • పాడుగ మేయుచునుండె

హరి—    అక్కటా,

రైతు—పండరు బైటనొక్కరటు • బండిన పైబడిదిబ్బ
హరి— నయ్యొహో,
రైతు—ఉండరు నొక్కరొక్కరటు • లుండిన వాడిక చెల్లు
హరీ— శ్రీహరీ,
రైతు—యుండితి మింతదాక
హరి— యిక • నుండగ లేమను చింతమానుడీ.

రైతులు—వాటెబ్బడాలని నీవూరకమంనువేమో. ఆమాటయైనా చెప్పినమా పాటు మేము పడియెదము.

ఆ॥ వె॥ వాటినెల్లవచ్చి • వడిసంహరించెదో
లేక యిచటనుండి, లేవ మనెదో
ప్రాణమున్న నింతె • బలుసాకు నైనను
భక్షణంబు జేసి • బ్రతుకగలము॥

హరి—ఆ॥ వె॥ రైతులార యింత • రాపిడి పడనేల?
తెల్లవారు దనుక • నెల్లి వచ్చి
వాటి నెల్ల నేను • వడి సంహరింతును
జనుడు శంకమాని • సదన ములకు॥

రైతు—దొరగారికి పదేల దండాలు. మేమిదే ఇండ్లకుబోయి కూడుదిని మాకుండు యీ తెల దీసికొని అడవులకు తరిమింబడ్తాము. (నిష్క్రమింతురు)

హరి—మంత్రివర్యా! మొన్న నిన్నటివరకు రేయుబన్నంబు లెఱుంగని యీ కాపులకు సంభవించిన ఆపదలుచూడ నా కేమియు పాలుబోక యున్నయది. ఎల్లప్పుడు మనయెడ పసిబిడ్డలవలె వర్తించువారల యాపదలు బాపకున్న నేమిసార్థకత? వేటకువలయు సన్నాహంబులు సిద్ధపరపింపుము. నే నిదే అంతఃపురంబునకు బోయి యీ వృత్తాంత మా పట్టపు దేవికెరిగించి వచ్చెద నీవు ప్రయాణ సన్నాహంబున నుండుము. ఇక కొలువు చాలింతము.

మంత్రి—చిత్తము. మీయాజ్ఞప్రకారము సిద్ధపరచెద.

(అని నిష్క్రమింప ను.)

## ద్వితీయరంగము. అంతఃపురము.

(హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు ఆసీనులై యుందురు.)

చంద్ర—మనోనాయకా! నేనెన్ని విధముల వేడుకున్నను, నీమనం బిచ్చగింపకున్న యది. నే నేమి సేయుదును? ఇక నాయభిలాష దీర్చువా రవరు?

హరి—దేవి! ఇదేటి కోర్కె?

మ॥ విరులా? వేడుకలా? విలాసవతులా? • విద్యా జనశ్రేణులా?
సిరులా? చిత్రములా? జగా నగరులా? • సింగారపుందోటలా?
మరులా? మార్గములా? మహాద్భుతములా? • మాణిక్య సౌధంబులా?
తరుణుల్ చూడగ రానితావు లతి య • ధ్యానంపుటారణ్యముల్॥

చం—హృదయేశ్వరా!

మ॥ విరులున్ వేడుకలున్ విలాసవతులున్ • విద్యాజనశ్రేణులున్
సిరులున్ చిత్రములున్ జగా నగరముల్ • సింగారపుందోటలున్
మరులున్ మార్గములున్ మహాద్భుతములున్ • మాణిక్యసౌధంబులున్
తరుణుల్ నాథులు చెంత లేనియెడ యో• ధ్యానంపుటారణ్యముల్॥

హరి—కాంతా ఎంత చెప్పినను వినవుకదా!

సీ॥ ప్రకటిత మణిమయ • ప్రాసాదములు గావు
కుటిలాద్రి సంఘాత • తటులుగాని
ఆనందమయమగు • నారామములుగావు
విజన మహారణ్య • వితతి గాని
సుపథంబుగనుబోవ • సోపానములు లేవు
కంటకోత్కర విలో • త్కరముగాని
సుస్వరంబులనీను • శుకతండములుగావు
ఘనతరోజ్వల మృగ • ధ్వనులుగాని
తే॥ గీ॥ వస్తు తతి లేదు భూత్రవ • కస్తి గాని
ఆటలునుగావు చూడంగ • వేట గాని
మగువ నీవేడ? కానన • మార్గ మేడ
అంతిపురమున నుండుమో • యంచ యాన .

చం—ప్రాణేశ్వరా!
ఉ॥ కాననమైననేమి మరి • గండశిలావృతమైననేమి భూ
తాననమైననేమి కుటి • లాద్రిసమూహము లైననేమి దు
ర్మానుషమైననేమి తమ • వజ్జన నుండిన నేకొరంతయుఁ
గానకయుందు నన్నిట ది • గాడక నైకొని పొమ్ము భూవరా.

ఎన్ని విధముల వేడుకొనినను నన్ని ట్లనాదరణ సేయుట భావ్యమా?
నిన్నెడబాసి, నేనొక్క నిమిషంబైనను సైర్పగలనా? పోసి; మీరంత
హాయమూనిన నేనేమి సేయగలదానను?

లోహి—తే॥ గీ॥ తండ్రి నీవెంట వచ్చినే • గండు మిగిలి
సింహ వ్యాఘ్రాది మృగముల • చెవుల బట్టి
చించి చెండాడి వైచెద • చిత్తగించి
యమ్మకును నాకు రమ్మని • యాజ్ఞ యిమ్ము.

హరి—(కుమారుని ముద్దిడుకొని) తండ్రీ! నీవెంతటికైన సమర్థుండవే. ఇకనిట
తడయరాదు. (చంద్రమతివంక చూచి)పడతీ ప్రజలిదుములలోబడి అడలుచుండిరి.
కడు శీఘ్రముగ బోవలయు రండు.

చం—(సంతోషముతో) ప్రాణేశ్వరా? మీయపార కృపాతిశయము నిప్పటికి
నాపైజూపితిరా?

హరి—కాంతా? కంటకారణ్యంబుల సంకటపడెదవేమోయని అట్లంటినిగాని
నేనొక త్రుటియైనను నిజంటబాయగలనా? ఇక నావెంటరమ్ము.

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

సేవ—(ప్రవేశము)
ఆహా? ఏమియీచిత్రము? ఈమృగంబు లెచ్చటివచ్చుటనే పుట్టుమన్నట్లున్న
యవి. అటులగానియెడల యిప్పటికి రెండుదివసంబులనుండి రొచటజూచిన
మృగమును నచటనే గూల్చుచున్నను, యిసుకపాతరవలె పెరగకున్నయవి. ఇక
యీరోజున వీటినన్నిటిని అంతమొందించగలము. (దిక్కులు పరికించి)
ఓహో! భూకాంతుండెడతెంపులేక కృతాంతుని పోలిక మృగంబులనంత
మొందించుచు సతీసుతసహితుండై యటే వచ్చుచున్నవాడు.

హరి——(ప్రవేశించి) భటులారా! మృగములనన్నిటిని నిశ్శేషముగనంత మొందించితిరా?

సే——లెక్క కొక్కడాసైనను బోనియక యొక్కడదాచిన మృగము నక్కడనే గూల్చితిమి.

హరి——సేనానాయకా! మన పరివారమునంతను దోడ్కొని పురంబుజేరుము. మేమిదె వచ్చెదము.

సే——చిత్తము. (అనినిష్క్రమించును.)

హరి——పౌరులారా!

తే॥ గీ॥ క్రూరమృగములు నశియించెనో • పౌరులార
భయము లేదిక జనుడి మీ • పల్లెలకును
పంటపైరులు గాపాడి • భద్రముగను
సత్పథంబున మెలగుడీ • సౌఖ్యముగను.

పౌరులు——(నిష్క్రమించుదురు.)

చంద్ర——ప్రాణేశ్వరా! మనమిదివరకు జూచిన ఘోరాటవిగాక చూపరుల మనంబు లుప్పొంగ జేయు నీసుందరోద్యానంబు గాంచుడు.

సీ॥ వింతలై బంగారు • బంతులై చూడన
త్యంతులై యొప్పు చా • మంతులమరు
హాయియై పంచమ • స్థాయియై సౌఖ్య ప్ర
దాయియై పికపాళి • గేయమమరు
వలపులై జిలిబిలి • కులుకులై వజ్రాల
గుళికలై చిలుకల • పలుకులమరు
ముదములై దేవతా • స్పదములై లావణ్య
సదనలై మల్లెపూ • పొదలునమరు

తే॥ గీ॥ పిల్లవలితెమ్మెరలు మెల్ల • మెల్లగనిట
నుల్ల మలరంగ చరియించు • చుండె బహుగ
చెప్ప శక్యంబె నీవన • చిత్ర మహహ
నందనవనంబు నీవన • సుందరంబె.

హరి——హృదయేశ్వరీ! నందనవనంబె కాదు. అలకుబేరుని చైత్రరథముగూడ దీనిని బోలదనుకొనియెద! అటుచూడుము..

# ద్వితీయాంకము.

సీ॥ మందార మాకంద • మకరంద రసఝరీ
పూర్ణంబు ఫలపుష్ప • పూరితంబు
కమనీయకల్హార • కలితకాసారంబు
సరస సారససార • సంయుతంబు
రాజిత రాజీవ• రాజ మరాళ వి
రాజితంబిల దేవ • పూజితంబు
శుకపిక శారికా • నికర నిస్వనితంబు
లలితపు లతల డో•లల ఘనంబు
తే॥ గీ॥ ఇందిరానంద సుందరీ • మందిరంబు
మంద మలయానిలాంచిత • మానితంబు
తావులకునెల్ల తావునౌ • నీవనంబు
చూడ లేదెన్నడిటువంటి • సుందరంబు.

చం—మనోహరా! ఈ వనరామణీయకం బెంత చూచినను తనివి దీరకున్నయది

హరి—మనోహరీ! ఇదియేదో యొక మునియాశ్రమమువలె నున్నది. మనమెంత పొరబడితిమి

చం—ఏమి, అట్లనెదరు?

హ—మునుల యనుమతి లేనిదే, వారియాశ్రమముల బ్రవేశించుట తప్పుగదా? (అనిదిక్కులుపరికించి) అవచ్చునది మనగురువులగు వశిష్ఠులవారివలె నున్నదే ఈయాశ్రమము వారిదే గాబోలు

వసి—(ప్రవేశించి) ప్రొద్దుగ్రుంకబోవుచున్నది ఎందులకిట వృథా కాలయాపనము? తపంబునకు గూర్చుండెద. (ముందువైపు జూచి) అవచ్చువారెవ్వరు?

హరి—(హస్తములు జోడించి) మార్తాండ వంశజ్ఞానోదయా! అఖిలాగమ పారాయణా! నీప్రియశిష్యుని నమస్కారములు గైకొనుము

వ—దీర్ఘాయురారోగ్యమస్తు హరిశ్చంద్రా! ఎంత యవివేకము! అతివలతో గూడి అడవుల దిరుగుట తగునా?

సీ॥ పరసతీ మణులసం • పర్కంబు యొక్కటి
పరవిత్తముల కాస•పడుట రెండు

పరుషముల్ తననోట • బల్కుచుండుట మూడు
నన్యుల నిందించుటయును నాల్గు
మద్యపానంబునే • మరిక గ్రోలుటయైదు
జూదంబు లాడంగ • జూచు టారు
కటికివానిని బోలి • కడు నిర్దయతబూని
యడవులయందు వే • టాడు టేడు
తే॥ గీ॥ సప్త వ్యసనంబు లివిజేయు • జనడు నృపుడు
యిచట తడయక నీపురి • కేగు మిపుడు
స్నానసంధ్యాద్యనుష్ఠాన•సమయ మిపుడు
గాన నిదెపోవు చున్నాడ • కాన విడుడు.

హరి—గురువరా! ఘోరమృగంబులు చెలరేగి, పంటపైరులపాడుజేయుచు, ప్రజ కతికంటకంబులై యుండు వాటిని సమయింప నిచ్చుతిరి వనంబు జూడవలయునని నాసతీ సుతులు నా వెంట వచ్చిరి;

వ—పోనీ; పొరబడినదానికేమిచేతువు ఇచ్చటి కతిసమీపముననే విశ్వామిత్రునాశ్రమమున్నది అత డతిముక్కోపి; పరనిందాపరాయణుడు; మీరాతనియాశ్రమంబు కడకరుగక కొంచెము చుట్టైనను తిరిగి శీఘ్రముగా పురికి జేరుడు. నేనిదె పోవుచున్నాడ (నిష్క్రమించును)

(ఒక లేడి కనుపించును)

లోహి—జనకా! అటుజూడుము.

ఆ॥ వె॥ పసిడి వన్నె గల్గి • మిసమిస లాడుచు
కనవు గోరికి కొనుచు • గంతు లిడుచు
పరుగు లెత్తు లేడి • పట్టి యివ్వుము తండ్రి!
అల్లి బిల్లి యాట • లాడు వాడ

హరి—తనయా! వన్నెల, చిన్నెల, జెన్నలరారు, నా కురంగంబునుం గాంచిన, నెవ్వరి మనం బుర్రట్లూగక యుండును! (చంద్రమతివంక జూచి) అతివా! మీరిచటనే యుండుడు; నేనొక త్రుటిలోపల నాహరిణంబునుం బట్టి తెచ్చెద.

(నిష్క్రమించును)

లోహి—జననీ! నాన్నగారా హరిణంబును, ఇప్పటికి బట్టుకొని యుండురా?

చం—పుత్రకా! మున్న నేక హరిణశాబకములను జూచితిగాని మేలిమి బంగారముం బోలు మేనును, స్వర్ణసమ్మిళితపద్మరాగము లీను చారలును, వల్లికలువలె నెంచు, మెల్లమెల్ల చూపులచే, అల్లిబిల్లిగానాడు, హరిణంబు నెప్పుడును జూడలేదు అది యంతయుండాడ, నొకరిచే బంపబడిన, కల్పితమాయా మృగంబుగా దోచుచున్నయది (ఆలోచించి) ఆధ్వనియేమిటి?

(తెరలో)

ఉ॥ పట్టగ బోవ జిక్కదొక • పట్టున నుండదు వెంట నంటగి
న్నట్టె దొకంత నేవటికి • వట్టె కనంబడు పుట్టచాటునో
గుట్టల చాటునో మెదల • కుండ తమాషగ నాడు దీని నే
పట్టుట దుర్లభం బిటుల • ప్రాణము తోడుత చిక్కు నింకిటన్॥

ఇది ప్రాణంబులతో పట్టుబడునట్లు దోచదు ఈ బాణంబుచె దీని ప్రాణంబులం దీసి యీ చర్మంబు గొనిపోయెద

లో—జననీ? మాజనకున కా సారంగంబు చిక్కినటుల కనుపించదు నేను సాయంబుగా బోవుదునా?

చం—తనయా! ఎలదు వలను సీఁనకుం డీసరికి వచ్చుచునే యుండును (దిక్కులు బరికించి) అదిగో వచ్చుచున్నవారలు

హ—(ప్రవేశించి) అతివా! ఆహరిణంబు, నాచే వ్రేటు తప్పించుకొని; అల్లదే కనిపించు, ముని యాశ్రమంబు జొరబడి, అట నదృశ్యమయ్యె అయ్యది విశ్వామిత్రుని యాశ్రమమువలె నున్నది నేనా గురువాజ్ఞ దాటుటకు శంకించి యా ముని యాశ్రమమును బ్రవేశింపక తిరిగి వచ్చితి అయ్యది నమ్మునీశ్వరుని పెంపుడు హరిణమేమో యని, నా కతిభయంబుగా నున్నది

చం—నాథా! నిఖిలాగమార్గ యోగుల కీ సారంగంబు లెందులకు? దిగులు జెందక యీశీతలోదకములను ద్రావి మీ యలసట దీర్చుకొనుడు (అనియిచ్చును)

హ—(దాహమును ద్రాగునటుల అభినయించును)

చం—ప్రాణేశ్వరా! హరిణగామివై చనుట వలన పథశ్రమం బధికంబుగా నుండునట్లున్నది కొంతసేపు నా యంకతలంబుపై విశ్రమింపుడు.

విశ్వా—(ప్రవేశించి) నేను గడ్డము పుట్టినది మొదలు ఎల్లరు, అష్టకష్టములబడి యాత్రికం ఖని పట్టిన నిప్పట్టుకు జేర్చితిని. వంటయింటి కుందేటివలె వీడెట్లన్నతమాడ కుండ తప్పించుకొని పోవునో చూచెద. ఇటుల వృథా కాలయాపనమేల? నే నిదె త్వరితంబుగా జని కొందరు చండాలవనితల సృష్టించి వీనికడకంపెద.

(నిష్క్రమించును.)

హరి—(త్రుళ్ళిపడిలేచి) తాపసోత్తమా! నిరపరాధుల రక్షింపుము, రక్షింపుము.
(అని చేతులు జోడించును)

చం—(భయాశ్చర్యములతో) ప్రాణనాథా! ఏమిది; ఇట్లు కలవరించితిరి ?

హరి—(విచారంబుతో తలవంచి యూరకొనును)

చం—(ఆతురతతో) అయ్యో, నాథా చెప్పరేమి? ఆ యాత్రమ మెయ్యది? ఆముని యెవ్వరు? రక్షించుట యేమిటి?

హరి—కలికీ! నే నొక కలగంటి.

చం—అదెట్టికల?

హరి—అండజయానా! నేనిందు పేరోలగంబున నుండ మండిపడుచు నొక భూసు రుండు వచ్చి నాకడకుజేరి, నాశిరంబుననుండు కిరీటము, తనపాదంబుతోడ పుడమిం బడనడంచి, రాజ్యం బూడదీసికొని, అడవులకంపి, యిడుముల గు డువజేసి నటుల.

చం—ఖరకరవంశభాగ్యోదయా! కలలో వచ్చిన సంగతి యిలలో లేదనెడి నాణ్యోక్తి మీ కెరుంగరా? ఏల యీలీల జాలినొందెదరు? కలుషహరం బగునటుల గానంబు సేయువారుండిన మీకలువరంబు దొరంగును. (ఆలకించి) ఈసమీపమున నే సుస్వరసంయుతంబుగా గానంబు విన వచ్చు చున్నది.

మంత్రి—దేవీ! అసందడి మనచెసకే వచ్చుచున్నది. చూడుము.

చంద్ర—(చూచి) మన్మనోనాయకదీనమానహరులగు గానదేవతలోయన వచ్చు చున్నవారలు.

మతంగాంగనలు:—(ప్రవేశింతురు.)

**వనమయూరవృత్తము॥ పిల్లవలి తెమ్మెరలు • మెల్లగను వీవన్**
**నుల్లమలరంగ నళు • లొప్పుగను బాడన్**

పల్లవము లాని పికపాళికలు గూయఁ
గొల్లగను మన్మథుడు • కోమలుల నేచఁ,

రాజా! నమస్కారములు.

హరి—ఉ॥ ఎవ్వరు? మీరలేటికిటు • లేగెద?రొచ్చిన కార్యమేమిరో?
జవ్వనులార! రాగస్వర•సంగతులన్ మిము బోల రెవ్వరున్
యివ్వన మందునుండుటకు • హేతువదెయ్యది? యేకులంబు? మీ
రెవ్వరి కోసమై తిరిగె • దేర్పడ దెల్పుడి దాచకంతయున్.

మతం—ధాత్రీకాంతా! మతంగాంగనలము. కంతుజయంతవసంతులకైనను వింతగొలుపు, యీరూపము గాంచి, మాయంతరంగము లింతింతనరాని వెతజెంద నాకంతుకేళి గలయ, నీచెంత జేరితిమి. మాభ్రాంతిందీర్చుము.

హరి—హీనకులజనితలారా! గానవిద్యావిశారదులని నామనంబున ఘనంబుగా నెన్నుచుండ, యిట్టి హీనచేష్టలకు బూనితిరే; చాలు, చాలు,

మతం—తే॥ గీ॥ అందగాడ వటంచుని • పొందుగోరి
యిందు వచ్చితిమయ్య మా•యందు జేరి
యిందు గనుపించు పొదరిండ్ల • యందు దూరి
యందముల బొందు మమ్ముల • నందకాని,

అందకాడా! నీసుందరంబు జూచినది మొదలా, మదనుం డదయుడై పదనుగల, ప్రదరములబరపి మామతులు, సదమదము జేసె. ఇక నీబెదరు పలుకులు మానిమా కౌగిటొసఁగుము. ఆమదనకదనంబున ముదము గదుర నేలకున్న మాయసువులొదలుదుము.

హరి—(స్వగతము) అకటా! నేనెంత జెప్పినను, వీరిచెవి కెక్కకున్నయది. ఇంకను నొక్కిచెప్పెదగాక! (ప్రకాశముగా) సఖియలారా! నే నేకపత్నీవ్రతుండ. నన్నిట్లక్రమముగాగోరుట మీకుతగదు. మీకు కావలసిన, చీనిచీనాంబరంబులును, లెక్కకుమిక్కిలగు నవరత్నంబులు చెక్కిన భూషణంబులు నిచ్చెద. చక్కగాఁగొనిపొండు.

మతం—రాజా! లెక్కకు మిక్కిలగు రొక్కంబు లిచ్చినను మాకక్కరలేదు. చక్కెరలం బోలు మీ యధరామృతంబొక్కసారి చురుక్కని నొక్కనిచ్చిన మాకక్కడగు రొక్కమిచ్చినట్లే?

హరి—మందయానలారా! అందరాని ఫలంబులగోరు మందబుద్ధు లెందైనను గలరే? ఇంక మీ డెందంబులసందియంబులమాని, నేనిచ్చు ద్రవ్యంబునుంగొని, యమందానందంబున, మందిరంబులకుం జనుడు.

మతం—మానవాధినాథా! ధనంబు గోరివచ్చితి మనుకొంటివా యేమి? కాదు. నీమనంబు గోరివచ్చితిమి.

హరి— తే॥ గీ॥ పరసతుల బొందు వానిని • పాపమొందు
(పంచపాది) ననుచు పెద్దలు జెప్పగా • వినరె యెందు?
నిందలను జెందులే గాక • నందు నిందు
కష్టములుగల్గు సౌఖ్యంబు • గలుగ దెందు
చాలు నిక యిందు నుండక • జనుడు ముందు.

మతం—భూపాలా! పాపంబను భయంబు నీకు వలదు. మే మాసందియం బెడఁ బాపెదము.

సీ॥ శౌరియై సుజనార్తి • హారియై జెన్నొందు
హరి గూడడే మేన • యత్తతోడ
శక్తుడై దాసాను • రక్తుడై త్రిపురారి
దారుకావనస్త్రీల • దనుప లేదె
మానియై నిగమాంత•జ్ఞానియై గాధేయు
డల మేనకతో పొత్తు • నలుప లేదె
భోగియై స్వర్గాను•రాగియై యింద్రుండు
గౌతము భార్యతో • గవయ లేదె
తే॥ గీ॥ దాశకన్యను గూడెప•రాశరుండు
దేవగురుపత్ని గూడడే • రేవిభుండు
వారికన్నను హెచ్చని • వరలె దీవు
వార లఘములు బొందిరే • వసుమతీశ.

రాజా! ఈశంక మాని, యామకరాంకుని కేళి కియ్యకొని, మమ్మలరింపుము.

హరి—ఓహో! తొండముదిరి, పూసరవెల్లియగుచున్న దే! నేనూరకున్న కొలది, వీరంత కంతకు మితిమీరి, మోహాంధలై, ప్రేలుచున్నవారలు. ఇక నే నూరకుండ

గూడదు. కండ్ల బెదరుజూపి, వీరి నవకల కంపించెదవ, (ప్రకాశముగా) మాశ తలారా! ఇకపై నిట్టి తులువమాటలాడిన, మీకలల తరిగింతును. ఇట నిలువ పొందు.

మతం—సీ॥ మతియందు నినుగోరి • బ్రతిమాలు యతివల
రతుల దేల్చనినీదు • హితవులేల?
మదియందు నీపొందు • ముదమార గోరెడు
తరుణి నే లనిమొగ • తనమదేల?
ఒంటరి గానిటు • వంటి బోటులగని
గవయ నేరని నీదు • కలిమదేల?
కాపాడు మని బహు • వాపోవు వనితల
ప్రాపు జేర్చనినీదు • రూపదేల?
తే॥ గీ॥ కోరివచ్చిన నారుల • గూడలేని
రాజునకు రాజ్యమేల సా • మ్రాజ్యమేల?
షండుడవు గాని ఘన పురు • షుండవీవె?
మగతనముదాల్చి తిరిగెడు • మగువవీవు.

హరి—సచివరా! నేనెంత చెప్పినను, కొంచెమయినను చెవిని బెట్టక మదించినీచంబుగా నన్ను దూషించుచున్నవారలు. నీ వించుకేనియు శంకించక వీరి నిచటనుండి వెడలించుము. అటుల చనరేని, నీచేతి కోలచే ప్రహరించుము.

చంద్ర—ప్రాణేశ్వరా! శాంతింపుడు.

మంత్రి—(మెడబట్టిత్రోయును)

మతం—(ఏడ్చుచు) అకేదుర్మార్గా! అబలలమగు మమ్మిట్టుల తరిమికొట్టుమనుటకు నీ నోరట్లాడెనురా? ఇక మాజనకుండగు విశ్వామిత్రునితో జెప్పి నీ మిడిసిపాటడగించెదము లే? (నిష్క్రమింతురు)

హరి—మంత్రివర్యా? వీరు విశ్వామిత్ర పుత్రికలమని చెప్పుచున్నవారలు.

మంత్రి—అవును. ఆయన పుత్రికలే.

హరి—వీరలు, వెలిజాతి, మాలలుగదా?

మంత్రి—అయిన నేమి!

హరి—ఈ కులహీను లెట్లాయన కుమార్తెలగుదురు?

మంత్రి— స్వయముగ సృష్టిజేసినవారు గాన, కుమార్తెలే యగుదురు.

హరి—అవును, మరచితి.

చంద్ర—హృదయేశ్వరా! ఇది యంతయుం బరికించ ముందేవియో ఆపదలొదవు నటుల దోచుచున్నయది;

చ॥ కలగనుటం గురంగమును • గాంచుటయుం గులహీనలైన మా
లలు నినుజేరి పొందుమనుట • ల్దలపోయగ గాధినందనుం
డలజడిగాను బన్నిన మ • హాకృతమో విధి వైపరీత్యమో
పొలసిన పూర్వజన్మకృత • మో? ముని జేసిన యింద్రజాలమో?

హరి—నాకు అటులనే దోచుచున్నయది.

(తెరలో) జనకా! నీ యనుమతిని, మేమా జననాయకుని జేరి, గానంబున, నతని మానసంబలరించి, నూనబాణుని కేళి కియ్యకొనుమన, త్రినేత్రావతారుండై మండిపడి, మమ్మనరానిమాటలాడి, పరిజనంబులచేత గొట్టి నెట్టించె. ఇక మే మెట్లోర్తుము!

విశ్వా—ఆ॥ వె॥ కొట్టుటకును చేతు • లెట్లువచ్చెను వాని
మిట్టిపాటునణతు • మీరుజూడ
గ్రస్తవాయు వ్రాత • నెట్టించి మత్తపో
నిష్ఠచేత వాని • కమ్మజేతు.

పుత్రికలారా! నే నిపుడేపోయి యాపాపాత్ముని భస్మీపటలంబుజేసివచ్చెద; మీరిక చింతమానుడు.

హరి—(వినుట నభినయించి) కాంతామణీ! ఆ వినవచ్చు కఠినకఠోరవాక్యంబు లావిశ్వామిత్రులవారివే గాబోలు? అయిన నాయన కేమపకారంబు జేసితిమి?

చంద్ర—మీరుగార లేమిజేసితిరో గాని మీరెరిగిచేసిన దొక్కటియు లేదు.

హరి—మానినీ! మనకీవిపత్తులు మూడ నున్నవోగదా!

చంద్ర—క్షత్రసుఖంబులు కాంతారంబుల డాగినను రాకమానునా? రానివి రమ్మని నన వచ్చునా? విధికృతమెట్లో అట్లుజరుగును. ఏల యీలీల జాలినొందెదరు?

విశ్వా—పంచచామరములు.

(1) ఒరే దురాత్మ! పొట్టఁగొట్టి • నోరులేనిబిడ్డలన్
దురాగ్రహంబు చేతఁగొట్టి • దోర్బలంబదెంతరా?
హరిశ్చంద్రరాముఁడు రాదులొచ్చి నన్ యజుండుగాచినన్
దురాగ్రహంబడంగఁజేతు • దుర్మదాంధ! నిల్వరా.

(2) చరాచరంబులన్ సృజించు • స్రష్టయైనగాని యా
పరాత్పరుండుగాని యావు • మావటైన గాని నీ
మొరాలకించి కావలేర • మోఘశక్తుఁడంచునన్
న్నారే రయొరే యెరుంగవా యె • రుంగఁజేతు చూడరా.

(3) చరాచరంబులన్ సృజించు • స్రష్టపై ప్రతిజ్ఞచే
చరాచరంబులన్ సృజింప • జాలినాడటంచునా
చెరాకెరుంగవా? మదంబు • చేతకన్నుగానవా?
పరాకుచేతనిన్నుబట్టి • బాధపెట్టుచూడరా.

హరి—(విశ్వామిత్రుని పాదములపైబడి) మునిచంద్రమా! వందనములు.

విశ్వా—(కిరీటమును కాలితోదన్నును) ఛీదురాత్మా! నీముఖంబుజూచిన పంచమహాపాతకంబులు సిద్ధించును. అవలనుండుము.

హరి—(పాదములనొత్తుచు)

తే॥ గీ॥ తలిరుటాకును బోలిన • త్వత్పదంబు
నొచ్చెనోయని నామది • రిచ్చదనము
నొందుచున్నది నీకిదె • వందనంబు
తపసిచంద్రమ! మానుమా • తామసంబు.

చంద్ర—(పాదములొత్తుచు) నవకోమల పల్లవ సదృశములగు తమపదపల్లవము లీమణి మయశిలావృతంబగు మహారాజుని కిరీటంబుదాకి యెంతనొప్పి నొందెనవోకదా!

విశ్వా—(పండ్లుపటపట కొరుకుచు) నృపాలకులపాంసనా! నీవుచేసిన యపరాధము నకు, నొక్క—పాదమేల? అపాదమస్తకముపరకు మండుచు పోవుచున్నయది.

కపటశీలా! ప్రళయానిల సముద్ధూత ప్రచండానిలుండనగు గాధేయుండనిన యెరుంగవె అస్మద్వనంబుజొచ్చి విరులంద్రుంచి సకలసద్గుణవరావిలాసలగు నాసుతలమర్దించి యుష్మత్పదపల్లవం బెంతనొప్పిగనినదో యనుచు ముచ్చువలె నచ్చుమాటలాడిన నిన్నిచ్చట విడుచువాడనే? పొట్టకూటికై మీవెంటనంటి బట్టువలె గట్టిగాస్తుతించు వసిష్ఠుండనుకొంటివా యేమి? పాపిష్టా!

హరి—తే॥ గీ॥ ఎరుగ కేమైన జేసితి • నేమొగాని
యెరిగి జేసిన యపరాధ • మింత లేదు
నిరపరాధుడ నయ్య న • న్నేలుమయ్య
మ్రొక్కువాడను గయజూడు • మునివరేణ్య॥

విశ్వా—(అవలక్షంజని) త్రిశంకు వంశకళంకా! బొంకులమారి! చంకనదుడ్డునిడి; శర ణార్థి, యన్నట్లుగా, పైకిపైకివచ్చి వంకరదండములు పెట్టెదవు; నిన్నింక విడుచుదుననియా యేమి? నీపొంకమడచిగాని, నిన్నింక విడువను.

హరి—మహానివర్యా! నా అపరాధంబు లెంచక, నన్ను గాపాడుము. నాకెవ్వరు దిక్కు? (అని పాదముల బట్టుకొనును.)

విశ్వా—(స్వగతము) ఇక నితని సంకటపెట్టగూడదు. కీలుబొమ్మవలె నాచే జిక్కి నాడిక నెట్లన్నృతమాడడో జూచెదగాక. (ప్రకాశముగా) హరిశ్చంద్రా! నీవపరాధివైనను, నీవుబడు పరితాపముంజూచి, నామానసంబునకు యింత కరుణ జనించినది. పోనీ, అటులనే కాచెదను, యీమాలచెలులను పరిణ యంబుగమ్ము.

హరి—తాపసేంద్రా! ఏలయింత పట్టుపట్టెదరు; నేనాపని జేయనొల్ల;

విశ్వా—ఎట్లా? ఎట్లా?

ఆ॥ వె॥ కుండలోని కూడు • కుండలో నుండగా
బిడ్డలెట్లు యుండ్రు • దుడ్డులుగను
యేలుమంచు కాలి • కేలికి బడమేలె
చెప్పినట్టి పనిని • జేయ కుండ॥

బృందారకా! కండక్రొవ్వు పలుకుల నుగ్గడించక, యీ ఛండాల సుదం తులను పెండ్లియాడుము.

హరి—మునిచంద్రమా! నామనంబరయ మీరిట్లనుచుంటిరిగాని మార్తాండవంశ సంజాతు లాఛండాలాంగనలను పెండ్లియాడుట పాపంబని తమ రెరుంగరా!

విశ్వా—(పకపకనవ్వుచు) ఓహో! ఎట్లా? ఎట్లా? పాపంబని భయంపడుచుంటివా? అమ్మ పుట్టిల్లు మేనమామదగ్గర పొగడవలయునా! మీతండ్రి దేశులము? విత్తు వకటివేసిన, చెట్టుయొకటి మొలచునా! ఆతండ్రికి పుట్టినవాడుగదా యీవు కాదువు? అట్లనుకొనిన, మీరందఱొక జాతివారేగదా! ఏల యీసందేహము? తిరస్కృతాచార్యుండును ఛండాలశాపజనితదగ్ధుండునగు మీతండ్రిని నాఖండలలోకంబున నుండునట్లుగా జేయలేదా? నిన్నుగూడ నాఖండల లోకంబున కంపెద? సంశయింపక యీ పారసాతుల చేపట్టుము.

హరి—హరిహరీ! (అని చెవులు మూసుకొని) తాపసేంద్రా! ఏల నన్నింత తరచితరచి తంటాలుపెట్టెదరు? ఈపనినిదప్ప యేపనినైనను మీరు చెప్పినట్లు చేయువాడను.

విశ్వా—మానవాధినాథా! ఈ పనియన్న, నీకంత హీనముగా నున్నదిగా?

ఉ॥ ఎల్లజగంబులందితఁడె యీతఁడె • కౌశికు నల్లుడంచు పే
ర్వెల్లిన జాలదే నినువరించిటు • వచ్చిన తోయజాక్షులన్
యొల్లనటంచు బల్కుటేల • యొప్పునె? నీవు నపుంసకుండవే?
బొల్లులకేల బోయి తలపోయవు • ముందటి కష్టముల్ మదిన్॥

హరి—తే॥ గీ॥ అరయ కైలాటకపుమాల • కాన్పు లేడ?
నాత్మబ్రహ్మత్వమునకిది • యొప్పు లేడ?
మాలచెలులను పెండ్లిగ • మ్మనుటి దేడ?
దుష్పథంబున కీర్తిచే • దూగు లేడ?

విశ్వా—ఎట్లా? నాసృష్టికర్తృత్వమును ఆక్షేపణ జేయుచుంటివా? దుష్టా! మిట్టిమిట్టిపడెదు, వశిష్ఠు నార్యారిపుత్రుల పట్టుబెట్టిన జగజ్జెట్టినైన నెరుంగవా? ఏల? ఈయట్టిమాటలు? ఈనాగారాబు బిడ్డలకు మంగళసూత్రంబు గట్టెదవా లేదా? గట్టిగా జెప్పుము.

హరి—తే॥ గీ॥ తుచ్ఛసుఖముల కాసించి • స్వచ్ఛమైన
స్వర్గ సౌఖ్యంబులనువీడ • జనునె యెందు?

పాలమున్నీటి లోఁ దేలు • పరమహంస
యుండ మనసిచ్చగించునే • యుప్పునీట?

విశ్వా—(స్వగతము) ఈతని కింకఁ బ్రియభయములచేతఁ జెప్పినను సుంతయైనను లోఁబ
డ్డట్లు కనపడదు. ఇఁక నీతని ముందట నాయాటలు సాగునటుల తోఁచదు. అయిన
నొకయాశ గలిపించి చూచెదఁగాక; (ప్రకాశముగ) హరిశ్చంద్రా!

సీ॥ అరణంబు గొనవలె • ననియాస యున్నను
మనమున ననుమాన • మంద నేల
కల్పద్రుమములైన • కామధేనువులైన
ననువొప్ప సురలకాం • క్షాచితమైన
నలకూబరునికుండు • నవనిధులైనను
గట్టువిల్తుని యున్కి • పట్టునైన
కాంచన గిరినైన • కౌస్తుభమణినైన
మెచ్చెడి యచ్చర • మిన్నలైన
తే॥ గీ॥ కోర్కెదీరంగ నిత్తుయీ • కోమలులకు
గట్టు మంగళ సూత్రంబు • గళమునందు
జగతి పూజియించు వాఁడెమా • మగుచునుండ
కొఱవ యేమున్న దికనీకు • ధరణిలోన॥

హరి—మహాత్మా! ఇవేటి మాటలు?

ఆ॥ వె॥ కులము నొక్కవంక • గూలగాఁ ద్రోసియు
సుకృత పధమువంక • నున్న జుట్టి
మాలచెలుల గూడి • మహియింద్రపదమైన
నొల్ల నాదు రాజ్య • మెల్లనొల్ల॥

విశ్వా—(స్వగతము) ఓహో! నేననుకొనినట్లే అయినది. ఇఁక నీనాటకమును
ముగించి, వేరొక నాటకమునకు దిగియెద. (ప్రకాశముగా) ఎట్లా? ఎట్లా!
ఇప్పుడు చెప్పినమాట నింకొకసారి చెప్పుము.

హరి—ఇప్పుడమిసైన మీకు విడుతుగాని యీ చండాలాంగనలను పెండ్లియాడు
వాడఁగాను.

విశ్వా—(ఆతురతతో) నిత్యసత్య వాచానిరతుండవు సుమా! ఆలోచించి చెప్పుము. ధాత్రియంతయు మాకిచ్చుట నిశ్చయమేకదా?

హరి—నిశ్చయమే,

విశ్వా—మున్మాటికి నిశ్చయమేకదా!

హరి—మున్మాటికిగాదు నలమాటికి యిష్టమే?

విశ్వా—అయిననిపుడు ధారబోయుము.

హరి— తే॥ గీ॥ ఏలినారుగదా పూర్వ మీధరిత్రి
మరలగోరుట జూడగా • చెరుకువిడచి
పిప్పికాశింప జనునె యో • విప్రవర్య
యేలుబడియందు భ్రమయున్న నిత్తుగొనుమి.

విశ్వా—(రౌద్రములో) మానవాధమా? ఒక్కనిముసములో నెన్నియనృతము లాడితివిరా! తడిగుడ్డలతో గొంతులుగోయుటెక్కడ నేర్చుకొంటివి? పూర్వ మేలినానట? అయ్యది మరలగోర చెరుకుపిప్పట? యేమిరా నీమాయమాటలు! ఓరి బొంకులమారి! ముట్టమొదట నేనివ్వలేనని ని పుట్టిమునుగునే? అట్లు యివ్వలేవేని యీచెలుల చేపట్టుము. లేకయున్న నిన్నిప్పుడు భస్మీపటలంబు జేసెద.

హరి—(తలవంచి యూరకుండును.)

చంద్ర—ప్రాణేశ్వరా!

సీ॥ జానెడుపొట్టకై • సత్పథంబునువీడి
దుష్పథంబునుద్రొక్క • దోషమయ్యా
కలిమిలేములు జూడ • కావటికుండలు
కలకాల మొకరికే • నిలుచునయ్యా
పుట్టజేసినవాడు • పూనిమేపునే
పట్టెడన్నముదాను • బెట్టడయ్యా
తనువు లస్థిరములు • ధర్మముల్ స్థిరములు
సత్యంబునిత్యంబు • నలుపుమయ్యా

తే॥ గీ॥ సూనృతవ్రతుజెందును • సుఖములయ్య
దురిత సంసారదుఃఖంబు • దొలగునయ్య
సజ్జనులు గోవుపదమున • సాగునయ్య
వేగతపసికి రాజ్యంబు • నీగదయ్య.

హరి—తననాథునకు యాపదలొదవెడివేళ, సత్ప్రధానువర్తియై పతికి హితము నొడగూర్చు అతివయేగదా గుణవతి! ఇట్టివిగదా యుత్తమసతీ గుణంబులు (మంత్రివంకజూచి) మంత్రివర్యా! పుడమి ధారాదత్తము సంగుటకు బవిత్రజలంబులం దెప్పింపుము

మంత్రి—(చిత్తము అనిజలకలశము నిచ్చుచున్నాడు).

చంద్ర—(అందుకొని) ప్రాణేశ్వరా! ఇదిగో జలంబులు.

విశ్వా—(కోపముతో) మాధాత్మా? అడపెత్తనము? తంబళిదొర తనము అన్నట్లు ఆడవాండ్ల యనుమతికా, నీవుపుడమి బాలించుట?చాలుచాలు. నీనడవడిదెలిసె రాజ్యంబివ్వ మనసొప్పదేని, నేనివ్వజాలనని చెప్పుము; నానడుములు లాగుకొని పోవుచున్నవి. (అనిపోవును)

హరి—(అడ్డంబుజని హస్తంబులుపట్టుకొని) తాపసేంద్రా! నాయాలస్యంబునకు క్షమింపుడు (జలంబులు దోసిట్లోబోసికొని) మునినాథా

తే॥ గీ॥ దేవ విప్రాగ్రహారము • లొప్పవీడి
నన్మదఖిలంబు తమకర్పితంబుగాను
ధరణి నాచంద్ర తారార్క • స్థాయిగాను
ధారబోసితి గైకొమ్ము • తాపసేంద్ర.

భూదేవోత్తమా! పరమేశ్వరప్రీత్యర్థముగా దేవబ్రాహ్మణక్షేత్రంబులందక్క తక్కంగల సప్తద్వీప, వసుంధరాతలం బంతయు ధనధాన్య, గృహారామ, పశుసహితంబుగా మీవశంబుజేసినాడ నిక మీయిష్టము. (అని జలంబులు విశ్వామిత్రుని దోసిలిలో నిడును)

విశ్వా—(జలంబుల గ్రహించి స్వగతము) అహా! ఏమి నా చమత్కారము! మాటల సందడిన తొందరపరచి అప్పమాట తలపెట్టకుండ రాజ్యంబు గైకొంటి; రాజ్యంబీకమునుపే యీతం డప్పుమాటయెత్తిన కోటిలో బ్రతిడికొనవలసి వచ్చినదే; అది యొక గొప్పసంకటము తప్పినది. (ఆలోచించి) వీరి నిక్కడనుం

డిరయే ఆడవుల కంపించెద. అటనయినను అన్యత మాడదా! (ప్రకాశముగా) పుడమిరేడా! నీకుగల సంపదయంతయు మూవశంబు జేసితివి; ఇంక నిట యేమిపనినీకు? వెళ్ళుము, మీరు పెట్టుకొనిన భూషణంబులన్నియునిటనూడ దీసి పెట్టుడు.

(అందరు భూషణంబుల నూడదీసి యిత్తురు)

హరి—మానిచంద్రమా! మామనవి వినుడు.

సీ॥ కన్నబిడ్డలవలె • కరుణజూపితిగాని
బన్నముల్ గనజేసి • యెన్నడెరుగ
ప్రియబంధువులవలె • ప్రేమజూపితిగాని
యెడబాసియుండుటే • నాడు యెరుగ
మిత్రులుగా వారి • మేలు గోరితిగాని
కష్టముల్బడుటయే • గని యెరుంగ
జనకునిరీతిగా • చనవుజూపితిగాని
ధనము లెక్కవగాగ • గొనియెఱుంగ
తే॥ గీ॥ ప్రాణము లెవారటంచు గా • పాడినాడ
నీవు వారల నట్టుల • నేర్పుతోడ
బ్రోచుదువా; లేవా; యంచునే • బాగులువాడ
ప్రజలె గద రాజునకు నెడ్డ • బలముజూడ

విశ్వా—ఒహో! గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినమాదిరిగా, నీవా నాకు నీతులు గరపు వాడవు! కత్తియొక చేతను కలమొక చేతను బట్టి పాలింపవలెగాని లేకయున్న వారడగియుందురా? చాలు చాలు. నీ నీతు లటగట్టిపెట్టి పొమ్ము.

మంత్రి—మానవేంద్రా! నినుబాసి నేనుండగలనా? నన్నుగూడ గైకొనిపొమ్ము.

విశ్వా—(స్వగతము) ఒహో, కొంపమునిగినదే? ఈ మంత్రియుగూడ వీరిచెంతనున్న వీరికెంతయో సహాయము జేయుచుండును. (ప్రకాశముగ) మంత్రివర్యా! నీవా ధాత్రీనాథుని పొంత నరుగ వలదు; మత్ప్రీతి నిధివయ్యి రాజ్యతంత్రంబు నడిపింపుము.

మంత్రి—దుఃఖముతో; హా సర్వేశ్వరా! ఈ మాయదారి జడలమారిని నాకేడ దాపురము జేసితివి! చిన్నతనంబునుండి యెడబాయకుండ జరియించుయీసర్వ

సద్గుణోపేతుని, యీనిత్యసత్యమూర్తిని యీ పరమశాంతస్వరూపుని, యీకా టిలో కొడబాపుచున్నవాడే! ఏనేమిసేయుదు! నాకెవరుదిక్కు? శేనిచ్ఛగించ కున్న యీమునిశాపాగ్నికింధనంబ నగుదును కదా?

హరి—మంత్రివరా! ఈసంయమీంద్రుడు చెప్పినటులనే చేయుము.

మంత్రి—భూపాలా?

తే॥ గీ॥ చిన్నతనమున నుండినన్ • జేరదీసి
విద్యచెప్పించి పెంచియు • పెద్దజేసి
మంత్రిపదమున నుంచి స్వ • తంత్రుజేసి
అకట! ననువీడ జనునె నా • హా జనేశ.

అకటా! తనయునికన్నను యెక్కుడు గారాబముతో బెంచెడు యీజననా థుడుచనినతరువాత, నేనిరాజ్యమున నుండిననేమి!పోయిననేమి! (అనిఖడ్గముతీసికొని) ఖడ్గరాజమా? బాల్యము మొదలు మనోవాక్కాయకర్మంబు లేకరూపంబుగ, నిత్య సత్యవ్రతాచారుండైన యీహరిశ్చంద్ర చక్రవర్తినిబాసి, యెటులుండగలను. గాన, జననాథుండు వనములకు జనకమునుపే నాకంఠంబును త్తరించుము (అని కంఠమునరుకు కొనబోవ)

హరి—(ఖడ్గంబుబట్టుకొని) మంత్రీ! నీకిదియేమివెఱ్ఱి? విరించి కృతానుభవం బెవరికిపా లనవచ్చిన, వార లనుభవింపవలయునుగాని, యొరులనుభవింతురా? నీవతి ధైర్యం బున నీపురంబుననే యుండి, ప్రజలకు నెమ్మది గలుగునట్లుగా, రాజ్యంబు పాలింపుము.

మంత్రి—ప్రభుదమీశ్వరా? మీరడవుల, యిడుముల గుడుచుచుండ, నేమిటనుండజా లము, అజ్ఞయిండు.

హరి—మంత్రివర్యా! నీకింతగా చెప్పవలయునా! నాని యాజ్ఞానుసారంబుగ యుండుము.

మంత్రి—చిత్తము.

హరి—మంత్రివర్యా! మరచితి. ఈ తాపసేంద్రుని పురంబునకు గొంపోయి, అస్మత్స్వ దవికంతకు, అధినాథునిగాజేసి, అస్మదాభాషణంబులుగా ప్రజలకందరికి తెలి యజేయుము.

సీ॥ నాకు మారుగ గాధినందను రాజుగా
　　　　గైకొని సుఖముల • గాంచుమనుము
నన్నరణ్యములకు నంపించె • ననిమాని
　　　　యెడకోపమును బూను • టుడుగుమనుము
మాన్యతంబును వీడ • జూడ కెల్లప్పుడు
　　　　సజ్జన వృత్తులే • సల్పుమనుము
నెవ్వని జనకుగా • నెంచుచుంటిరో వాని
　　　　పై ననురాగంబు • మానుమనుము
తే॥ గీ॥ నాకు మీకును ఋణముసే • డాకరనుము
　　మరల మిముజూచు భాగ్యంబు • దొరుక దనుము
　　అడవికినిబోవ నాజ్ఞనే • నడిగి తనుము
　　వీడిపోలేక పోయెను • రేడటనుము॥

మంత్రి—చిత్తము.

హరి—మహేంద్రా! ఆజ్ఞనిత్తురా?

విశ్వా—ఆజ్ఞనివ్వక నిక్కడ వుండమంటినా యేమి!

చంద్ర—అయ్యా! ఇంత ఆగ్రహమెందులకు? మేమిప్పుడే పోయెదము లెండు.
　　　　　　　　　　　　　(అని నిష్క్రమింతురు.)

విశ్వా—(అటునిటు పరుగెత్తుచు) అయ్యో! అయ్యో! హరిశ్చంద్రా! నన్నింత యన్యాయము చేసిపోయితివిరా! హరిశ్చంద్రా! హరిశ్చంద్రా! ఇటురమ్మా.

హరి—(తిరిగివచ్చి) అయ్యా! తమకేమి అన్యాయము జేసితిని?

విశ్వా—(ఆతురముతో) ఏమి జేసినది, జ్ఞాపకము లేదా?

హరి—ఏమియో నాకు జ్ఞాపకము లేదు.

విశ్వా—నేజ్ఞాపకము జేసెదనా?

హరి—ఏదీ చేయుడు.

విశ్వా—నాడు నాకు యజ్ఞార్థమై వాగ్దత్తము జేసిన ధనంబుండ లేదా?

హరి—(ఊరకుండును.)

విశ్వా—(కోపముతో) ఆహా! దుర్మార్గుడా? యిదివరకెందరి కొంపలుతీసి యింత సంపదగూడబెట్టితివిరా? బ్రాహ్మణుల సొమ్మనిన, పాడిబెల్లముగా నుండునా! విప్రసొమ్మనిన విషముమేలను సామెత నెరుంగవా? ఈ యిలపై సత్యము నిలుపుకో దలచితేని మాటకు మిమ్ము.

హరి—(విచారముతో) తాపసేంద్రా!

మ॥ ధనముల్ ధాన్యములున్ గృహంబులును వి త్తక్షేత్ర కారామముల్
కనకం బశ్వము లేనుగుల్ రథములున్ కాసార వర్గంబులున్
మునునీకిస్తిని యస్మదీయవిభవమ్ముల్ గొంచెమున్ గోరకన్
ధనమే నెచ్చట దెత్తునయ్య చెపుమా దారిద్ర్యమూహింపుమా॥

తాపసేంద్రా! అస్మత్సకల సంపదలు తమ యధీనంబుజేసి నాడనుగదా? ఇక ధనంబెచ్చట నున్నది?

విశ్వా—పోసి, పాపము, యివ్వజాలకున్న నేనివ్వజాలనని యనృతమాడుము.

హరి—ఎన్ని బన్నంబులైననుబడి మీ ధనంబిత్తునుగాని యనృతమాడువాడనుగాను.

విశ్వా—అయిన నెప్పుడిత్తువో చెప్పుము!

హరి—ఒక మాసములోజులలోపల నిత్తును.

విశ్వా—నృపకులాధమా

తే॥ గీ॥ మద్యమును ద్రావియుండిన మనుజుమాట
కామినీలోలుడౌ విటుగాని మాట
రాజ్యనాశకుడైనట్టి రాజుమాట
నమ్మజనదెందు మీమాట నమ్మనిచట.

ఓక్క పిగిలించేదానికన్న; వెళ్ళి వెక్కిరించినదే మేలనురీతి కాలికిబుద్ధిచెప్పెద వేమొ; మాటకు మిచ్చుదాక, మాశిష్యు నొక్కనిని నితావునకుంచుకొనుము. (అంతయము వచకజాచి) నక్షత్రకా! ఇటురమ్మ.

నక్షత్రకుడు—(ప్రవేశించి) గురువర్యా! వచ్చితి, సెలవు.

విశ్వా—నక్షత్రకా! నీ వీ క్షణంబున నితని వెంటజని నెలరోజుల లోపల మాకు రావలసిన ధనంబిప్పించుకొని తత్క్షణంబున రమ్ము.

నక్ష—యత్నేశుడైనను భిక్షమెత్తింపజాలు నక్షత్రకుండవని యెరింగియు నాకు శిక్ష చెప్పవలయునా? నేనక్షయ విద్యారత్నము దక్షుండననుట మీ యెరుంగరా?

హరి—సంయమీంద్రా! సెలవొసంగెదరా?

విశ్వా—ఈమునివస మమ్మొదలి పోవునట్లు తోచదు. అది యేదియో చెప్పదలచుకు న్నదంతయు ఒక్కసారే చెప్పి కదలుము.

హరి—అయ్యా! ఇంత ఆగ్రహమెందులకు?

నక్ష—గురువరా! నాచద్దియన్నము మాట జెప్పితిరా?

విశ్వా—హరిశ్చంద్రా! మరచితి, ఈ నక్షత్రకుండు, కన్నతల్లి నైనను నోరుదెరచి అన్న మడుగ జాలనివాడు. ఇతని నెట్లు గాపాడెదవో జాగ్రతసుమా?

హరి—అయ్యా! మీకింత భయమేల. నా నెత్తిన బెట్టుకొని కొలుచుకొనియెద.

నక్ష—అట్లయినను సరేపద. నీయంతు కనుగొనియెద.

విశ్వా—(నక్షత్రకుని బిలచి) సామదానభేద దండోపాయముల నీ పనిని చక్కజేసు కొనిరమ్ము. (అని చెవిలో జెప్పును)

నక్ష—నన్ను బడిలోనుండి తొలగించవలయునేగాని యిటువంటి పనులనిన నాకు జెప్ప వలయునా?

(హరిశ్చంద్ర- చంద్రమతి, లోహితాస్య, నక్షత్రకులు, నిష్క్రమింతురు)

విశ్వా—(స్వగతము) ఈ ప్రుడమిరేనిని, యెన్ని విధముల, సాధించినను, అనృతంబు లాడుట కొడంబడక, యున్నవాడు. ఇంత రొక్కమెక్కడ జెచ్చి యిచ్చునో! నే నదృశ్యాకారుడనయి యీతని వెంట నడవుల వెంటనంటి యిడుమల గుడువజేయువాడ. (ప్రకాశముగా) మంత్రీ! మనము పురంబునకు పోవుదము రమ్ము. (అని మంత్రియు విశ్వామిత్రుడు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము

(సంపూర్ణము)

---



# అభినవహరిశ్చంద్ర.

## తృతీయాంకము.

అరణ్యము.

(హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు, ప్రవేశింతురు.)

(నక్షత్రకుడు నడువలేక వెనుక వచ్చుచుండును)

హరి—పుట్టిన దాదిగా, కష్టంబులన నెట్టివో యెఱుంగని, యీ సతియును, బాలుడును నట్టడవిలో నెట్లు సంచరింతురోగదా?

చ॥ అడుగిడ, పాదముల్ గములు • నంచుదలంచెదు నీమృగాక్షి నే
డడవులలోన నెట్లడుగి • డం గలదో యెటునేతు దైవమా
(లోహితాస్యుని చాయజూచి)
కడు సుకుమారు డీ సుతుడు • కానన భూములలోన కష్టము
ల్పడుమని వ్రాసె పద్మజుడు • పాపమటంచు దలంప కెంతయున్.

చంద్ర—ప్రాణేశ్వరా! నా యొడలు తడబడుచున్నయది. ఇక నొక్క యడుగైన నిడజాలను.

తే॥ గీ॥ ఎండవేడిమిచే మేను • మండుచుండె
నాకలికి నోర్వ్వకను సుతుం • డడలుచుండె
కటికి రానేలపై కాళ్ళు • గాలుచుండె
నడుగు నిడబూన నామేను • వడకుచుండె

(అని కూరుచుండును)

హరి—(దుఃఖముతో) పడతీ! ఎచ్చటనయిన నొకతరుశిఖన మధు ఫలాయాస మపన యింతవున్న కిచటజూచినను జిలుగుగుట్టలేగాని విశ్రమించుటకు యోగ్యంబైన వృక్షంబు గనుబడదాయె. ఏమి సేయుదము? అకుమారు నిటు లిచ్చి కొల్లగా రమ్మ (కుమారుని దీసికొనును.)

సీ॥ నడచి యెరుంగనీ • కడుఘోర వనముల
మందిరారామంబు • లందెగాని
ఆలించి యెరుగవీ • హరిభీకరార్భటుల్
శుకపికా లాపంపు • శ్రుతియెగాని
సాపడి యెరుగుదే • చవిలేని ఫలముల
సరసాన్న ఘృత పాయ • సములెకాని
వీక్షించి యెరుగుదే • విజనప్రదేశముల్
విమలసౌ ధాంతర • వితతిగాని
తే॥ గీ॥ కటకటా యెట్లు • నడతువీ కటికినేల
కలికియెట్లోర్తు వీయెండ • కాళ్ళుగాల
ప్రకట దుస్సహా మయ్యెనీ • బాధచాల
చూడ జాలను నేనింక • చూడ జాల.

చంద్ర—(లేచి, హ్రాదయేశ్వరా? చతుస్సముద్రముద్రితమైన యిలాతలంబెల్ల నేకచ్ఛత్రాధిపత్యంబుగా పాలించిన మీరలేయిట్లు ప్రయాస పడుచుండ, మీయర్ధాంగినగు నాకిదియొక లెక్కయే; మీమృదుమధురవచనసుధారసాస్వాదనముచే నాశ్రమ యుపశమించినది. (అని నడచుచుండును.)

లోహి—

తే॥ గీ॥ ఆకలికి నోర్వజాల బా • బయ్యగారు
అన్నమును బెట్టు మిక నాకు • నమ్మగారు
మంచి నీళ్ళను బోసిన • మంట యారు
నకట పలుకిడ కుందురే • యమ్మ మీరు.

హరి—(విచారముతో)

సీ॥ తోడి బాలురగూడి • యాడు చుండెడివాడ
వడవుల యిడుముల • గుడువ వలసె

గుజ్జుపుబగ్గల • గూరుచుండి షికారు
కరిగెడు వాడ వి • ట్లరుగవలసె
బుడిగాడ్పులకు • గడగడవడంకెడినీవు
సుడిగాలికొడిబడి • యడలవలసె
నిండు పున్నమనాటి • పండువెన్నెల కాంతి
నుండెడు మోమెండ • నుండవలసె

తే॥ గీ॥ ఘోర! విధిమాయ యెంతటి • యద్భుతంబు
చింతలను ముంచు నెంత శ్రీ • మంతు నైన
భాగ్యవంతుని నైన ని • ర్భాగ్యు జేయు
రాజు నైనను, బిచ్చాల • రాజు చేయు.

ఆసేతుహిమాచలపర్యంతంబగు ధరాతలం బెల్ల నేకచ్ఛత్రాధిపత్యంబుగా, పాలించిన, నీహరిశ్చంద్రచక్రవర్తికి నేడుతనపుత్రునకుపిడికెడు మెతుకులు, బెట్ట గతిలేక పోయెగదా! పుత్రకా! ఇందెందైన జూచి, జలంబులు దెచ్చి నీ దాహామార్పెద; నించుక యోపికపట్టుము.

నక్ష—(కలుసుకొని చురచుర జూచుచు) అయ్యో! హరిశ్చంద్రా! హరిశ్చంద్రా! నీ వెంత దుర్మార్గుడవోయీ! నోరులేని వానినిగాజేసి నన్ను క్రూరమృగంబుల కర్పించిన యీారణ్యం బడుగువారులేక, తిరపిగా బ్రదుకవచ్చునని దురూహజేసి మీముగ్గురొక్కటిరై, పరుగెత్తికొని వచ్చితిరా? క్రూరాత్మా! అరంభ శూరత్వమున కిదియేనా ప్రారంభము!

హరి—అగ్రజన్మా! ఎగవేయు వానికీ యుగచాల్లెందులకు? నేనట్టి వాడనుగాను. మాయందను గ్రహముంచి జాగ్రత్తగారండు.

నక్ష—(స్వగతము) అహా! వీరి నిప్పట్టుననుండి, కదలనియ్యగూడదు. ఇప్పటికి మిట్ట మధ్యాహ్నమాయె. తల దాచుకొనుట, కింత చెట్టునీడయైనను లేని యీానట్ట డవిని తిప్పలుబెట్టెదగాక. (అయాసముతో)

షట్పాది— తే॥ గీ॥ నాలుకెండెను శిరమును • గాలుచుండె
మండుటెండకు కాయంబు • మంటలెత్తె
నబ్బ చరణంబు లెల్లను • బొబ్బలెత్తె

నిబ్బరించఁగఁజాలయా • యుబ్బకిఁపుడు
నాకలికిఁప్రాణ మోర్వ క • ల్లాడుచుండె
పుడమిపాల! నడువఁజాల • నడువఁజాల.

(క్రిందఁగూలబడి) అబ్బా! రామ! రామ! ఇచ్చువున్నవారు పుచ్చుకున్నవారు బాగుగనే యున్నారు, నడుమ నాకొచ్చినదేమిరా యీశ్వర! (డగ్గుత్తికతో) అయ్యో! అయ్యో! నోట మాటరాకున్నయది, కాలుచు బొడ్డుదరి కిద్దుకపోవు చున్నయది. (కుడిచేతిశాడిని బరీక్షించుకొని) ఇక నే బ్రతుకుట కల్ల. వాడి గూడ స్తంభించిపోవుచున్నది. హా దైవమా! చుట్టాలు, పక్కాలు, నా దుట్టు కేరి, యింతకంట హెచ్చైన పెట్టుకోకుండ యీ నట్టడవిపాట్టను నా ప్రాణములం బెట్టుచుంటివిగా! (కన్నులు దేలవైచి) అ, అ, అ, దాహము. దాహము. (అని యూపిరి పోయినవానివలె క్రిందపడును.)

చం—(నక్షత్రకుని స్పృశించి) మనోనాయకా!

ఉ॥ అక్కట మానిపుత్రుఁడిటు • లాకలటంచును దాహమంచు నే
దిక్కును దోపనీక ధర • ద్రెళ్ళినరీతిగ నున్నవాఁడు నీ
వెక్కడికైన బోయి పుడిసెండు జలంబుల దెచ్చి వీనికిం
గ్రుక్కలు బోయకున్న మన • కున్నదిముందర బ్రహ్మహత్యయుఁన్.

మనోనాయకా! మన మెటులనైన నోర్చుకొందుముగాని యీ ధరణీసురుం డోర్వజాలకున్నవాఁడు. మనలోహితుని డించి నీ వేయెడకైన నరిగి నీరంబుఁ గొనివచ్చి యీ పాఱునిం బ్రతికింపుము.

హరి—నారీమణీ! నీరంబులిచ్చేరువను దొరకుట దుర్లభంబు. నేను ముందుజని నీరంబు లుండు తెరంగరింగివచ్చెద. మీరీ ధారుణీసురుని దోడ్కొని యీదారిదోలంగ రండు. (నిష్క్రమించును.)

చంద్ర—ధరణీసురవర్యా! మెల్లగా లేచి వచ్చెదరా?

నక్ష—(ఎగవూపిరితో) మొత్తమునకు నా ప్రాణములు దీయువరకు మీరు నన్ను విడుచు నట్లగుపడదు. ఎలుకకు ప్రాణసంకటము. పిల్లికి చెలగాట మన్నట్లు నేను నడు వలేక మొత్తుకొనుచుండ నన్నిట్లేల రమ్మని పిలిపించెదరు? పోనీ; మీమాటలనేల త్రోసివేయవలె? మెల్లగా వచ్చెద (అని లేచుచు పడుచు వచ్చుచుండును.)

(తనలో) మాగురుని యాజ్ఞచొప్పున వీరి నెంతయుఁ గష్టముల బెట్టినను వీరు ధైర్యము సడలక చరియించుచున్నవారలు. ఇదియంతయుఁ జూడ మాగురుని ప్రతిజ్ఞ నెరవేరునట్లు తోఁచదు. అయినను హరిశ్చంద్రుఁడు వచ్చులోపల యేవో కొన్ని దురూహ లీతరుణికి బోధించి వీరి నెడబాప ప్రయత్నించెద.

చంద్ర—ధరణీసురవర్యా! ఈదారి దొలంగక రండు.

నక్ష—చంద్రమతీ! నీ వెంత పాతివ్రత్యమహిమాశ్రీ; నిన్ను జూచిన నాకెంతయు జాలిగలుగుచున్నయది. (అని ఆయాసముతో కరుణ ననుకరించుచు)

ఉ॥ తాపసుమాయమాటలకు • ధారుణి నెంతయు ధారవోసి; యే
పాపమెరుంగ కెడ్డడుగు • బాటలనాటల దేలిపోలిసా
ధోపరిభాగమందున య • థోచితవృత్తిని నుండుమిమ్మయి
ట్లాపదలందుముంచెనని • యాతని యేమనకుండు మానినీ
కాపుర మెట్లుజేసెదవు? • కాంతుడు గాడిక నీకు శత్రుడా.

చంద్ర—అయ్యా! ఎంతమాటాడితిరి. ఈనీతుల, పతిహితలైయుండు, సతులకుఁ జెప్పదుర్నీతులుగాని, పతిహితలైయుండు యువతులు, విను నీతులుగావు. మీరీ కథల కట్టిపెట్టి మెల్లగా రండు.

నక్ష—(స్వగతము) ఇదియంతయు, మాగురుం డదృశ్యాకారుండై చూచుచునే యుండును గదా? నేనెన్ని విధముల వీరిని మోసగించదమన్నను సాధ్యపడకున్నయది. అయిన నింకొకసారి చెప్పిజూచెద (ప్రకాశముగా) అమ్మా! చంద్రమతీ!

మ॥ కుడువన్ గూడును లేక యీయడవులన్ • కుయ్యోమొఱోయంచు మీ
రడలన్ గారణమేమి? మాగురునియు • గ్రంబెట్లో పోఁజేసి మీ
రడిన తెన్నేతలమెల్ల నీసుతునకే • నిప్పింతు రావమ్మ యో
వడతీ! కష్టదరిద్రుడౌ మగనితో • బన్నంబు నీకేటికిన్

చంద్ర—స్వామీ! ఏలయిట్లసంబద్ధాలాపంబు లాడెదరు?

సీ॥ ఇల్లువాకిలిజూడ • వల్లకాడేగాని
వసియించుటకుమంచి • వసతిలేదు
[illegible] నింప్రుట జూడ • బిచ్చటనమె గాని
పూటకైనను యుంట • పాటు లేదు

నగనాణెములు జూడ • నాగుబాములెగాని
కడకొకకుట్టుపో • గైన లేదు
కట్టుబట్టులుజూడ • కరిచర్మములెగాని
అరయంగ చింపిగు • డ్డైన లేదు
తే॥ గీ॥ ఇట్టివానినిమగనిగా • గట్టుకొనియు
పూజసేయదెరియాగౌరి • పుణ్యచరిత
భాగ్యవంతుడుపతియు న • భాగ్యవంతు
డపతిగానుండునయ్యోరియో • య్యడనునైన
తే॥ గీ॥ తుచ్ఛసుఖములకాశించి • స్వచ్ఛమైన
స్వర్గసౌఖ్యంబులనువీడ • జనునెయెందు?
పతినివీడినసతియధో • గతికిజనదె
సతికిపతిదైవమనియెడి • శ్రుతులువినమె?

నక్ష—కానికాలంబున మంచిజెప్పినను చెడ్డగామారుచుండును. నేనేదో పాపమని మీకష్టంబులంజూచి యోర్వజాలక యుపాయంబుజెప్పిననయ్యదినాకపాయం బయ్యె. ఇక నేజెప్పను.మీయిష్టము,రయేగంగలోనైనను మాకిభావండి.నాకేమి లే. (నక్షత్రకుడు, చంద్రమతియు, లోహితాస్యుడు నొక ప్రక్కగాబోవుదురు. ఇం కొక ప్రక్కగా హరిశ్చంద్రుండు ప్రవేశించును.)

హరి—(అయాసముతో)
ఉం॥ అడుగిడపాదములగమలె • నంతకుజేరగబూనె ప్రాణము
ల్కడుగృశియించెదేహము,వి • కావికలైచనుచుండె ధైర్యముః
తడబడెమాట, దాహమును • తాపమునెక్కువయయ్యె,నారయీ
పడమటికొంబరంబుప గ • వానికినైననువద్దు దైవమా?
మగవాడనగు నేనే యిట్టులగడుపడుచుండ యెన్నడు నెండకన్నెరుంగని నాసతీసుతుల సంగతి నిక జెప్పవలయునా? అయ్యో! ఎటులేగెదమన్నను పదయుగంబు కదలకున్నయది.

సీ॥ జిలుగు గుట్టలిల్లె • చీలమండలు
దాకు బరపిడిచేర క • మొలుకుచుండె

బడిరాళ్ళపైన కా • లిడ పదంబులను గాల
ఱెండ తెల్ల గడగడ • వడకుచుండ
నెండవేడిమిచేత • మండెడు రాలపై
నడుగిడ పాదముల్ • యుడలుచుండ
నాకలిచే శ్రమంబధికం • బగుచునుండ
కన్నులకును భ్రమల్ • గప్పుచుండ
తే॥ గీ॥ ఆకలనుచును మునిసుతుం • డడలుచుండ
అన్నమోయంచు సుతుడు న • ల్లాడుచుండ
ప్రాణముల్ పోవగా సిద్ధ • పడుచునుండ
వనరి పరరుణమున జావ • వ్రాసియుండె.

ఆహా! తలదాచుకొనుటకు, యీ ఘోరాటవి యందింత, భూరుహచ్ఛాయయైన లేనుగదా? కడకింత పచ్చని గడ్డిపోచయైనను లేదే; అవురా! విశ్వామిత్రునిమాయ! మహాత్మా! మీకేమపకారము సలిపితిమి? (నిదానించి) కాదు. కాదు. అపకారమేమున్నది? అనృత మాడించవలయుననియే (విచారముతో) హరిశ్చంద్రా! ఇప్పుడింత జేసితివి. ఇక ముందేమిచేయనున్నాడవోగదా! (ఆలోచించి) ఏమిచేసినను సరే; నేననృతమాడెద ననుకొంటివా? అది యంతయు కలలోనివార్త (దిక్కులు పరికించి) అల్లదే కావోలు, అయుపీందుబ్రిడరింగించిన, జలాశయంబు. విచారసాగరంబున మునిగడి, యాపారుని మాట మరచిపోయితిని. అపారుడు బ్రతికియుండెనో లేదో; (ముందువైపు జూచి) అదుగో వచ్చుచున్నవారలు. వారిని నాజలాశయంబుకడకు, తీసికొని పోయెదగాక.

(నక్షత్రకుడు, చంద్రమతి, లోహితాస్యుడు ప్రవేశింతురు.)

నక్ష—(పండ్లు పటపటగొరుకుచు) ఒరే దుష్టాత్మా! నీవు నష్టేటపుట్టి ముంచేవాడవు గదరా! మమ్ముల నీనట్టడవిని విడచిపెట్టి, నీవింత సేపెట్లుంటివిరా?

హరి—నీరంబులీచేరువ నెందునంగానక తిరిగితిరిగి వేసరి, తుదకొక మునివలన నెరింగివచ్చితి; త్వరగా రండు. నీరంబులీ చేరువనే యున్నవి.

నక్ష—(విచారముతో) నీరంబులైనాద్రాగి, నీరుణంబు నిప్పించుకొనిపోదమని, గంపెడాసతోనున్న నాకుపచారంబులు జేయవచ్చితివా? చాలు, చాలు, నేబ్రతికియుండుట నీకిష్టమేని నీరంబులుదెచ్చి నాగుక్కలో బోయుము. నేనిక మూరెడు దూరమైనను రాజాలను. (అని చతికిలబడును.)

హరి—

చ॥ పడమటికొండ చాటునకు • భానుడు పోయె దిగంత రాశముల్
కడువడి చిమ్మ చీకటులు • గ్రమ్ముచునుండె; విహంగ సంతతుల్
గడబిడ జేయుచుండె; మృగ • గర్జనముల్ వినవచ్చుచుండె నా
కొడుకు గిడజాలక వటుడు • వ్యాకులుడై పడియుండె నక్కటా!

ప్రొద్దుబోవకమునుపే, యీదాపున నున్న పల్లెయొద్దకైనను జేరవలయునని, యది యంతయు కల్లయయ్యె; ప్రేయసీ! నీవీకుమారుని నెత్తుకొనిరమ్మా, నేనిభూసురేంద్రుని దోడ్కొనివచ్చెద

(అని అందఱుమడుగుయొద్దకు జేరుదురు)

చంద్ర—అయ్యా! తమరీ తీరంబున జేరి, నీరంబుల తనివిదీర పుచ్చుకొనుడు.

నక్ష—ఈజలాశయంబునందిగి నీరంబులం బుచ్చుకొనుటకు నాకతిభయంబుగానున్నది

హరి—అట్లయిన మేమతిజాగ్రత్తగా పట్టుకొనియుందుము లే?

(అని నక్షత్రకుని పట్టుకొనియుండును.)

నక్ష—జాగ్రత్తసుమా? (మడుగునదిగి జలముల్ద్రావుచు త్రుళ్ళిపడినట్లు మడుగు వెలుపలబడి) అయ్యో, అయ్యో, ఎంతదుర్మార్గమునకు వడిగట్టితివిరా?

హరి—అయ్యా! నేనేమి దుర్మార్గము జేసితిని?

నక్ష—(భయపడినటుల మేను గడగడవడంకుచు) ఏమి చేయవలయు? ఏమి చేయవలయు నో అదియే చేసితివి

చం॥ మడుగున ద్రోసి నన్నుమటు • మాయము జేయగ నెంచినట్టి నీ
గుడగుడలన్ని యిప్పుడిక • గోచరమై కనుపించె లేనిచో
కడువడి నన్ను యోమయము • గా మటుమాయము జేయకుందురా
కడు తెలివైనవాడగను • కన్ కడ తేరవు నీ ప్రయత్నముల్

హరి—అయ్యా! ఏలనన్నిట్లపనిందలపాలు జేసెదరు?

చం॥ కడకొకకాసునైన యర • కాసయినన్ గణియింపకుండని
వ్వడువున నస్మదర్థమురవంత్తయు దాచక గాధిసూతికిన్
కడువడినిచ్చి మేమిటుల • కష్టములొందుట యేటికయ్య యి
ప్పుడు మము నిట్టులేవనిన • మాటకు వచ్చునె నీముల్లె కొచ్చునే?
నీకపకారమునర్చిన మాకేమి ఉపకరించును?

నక్ష—అందినేజూట్లు, అందకపోయినకాళ్ళు పట్టుకొనువారలు, మీసంగతి నేనెరుగ ననియా?

చంద్ర॥ అవనీసురవర్యా? ఆగ్రహింపకుడు.

హరి॥ (కందమూలములను చేతపుచ్చుకొని) నక్షత్రకా! ఈయల్పాహారంబుల పుచ్చుకొనుడు.

నక్ష:— నేనెప్పను, బ్రాహ్మణార్థములుచేసి, వడలు, అతిరసములు, మొదలుగాగల పిండివంటలతో సహా కుక్షింబంటిగాదిని, ప్రేవుమనత్రేపుచు యేమూలనో యొత్తిగిల్లెడు వాడను. ఈ యడవులలో బెట్టియన్న మోలక్షణ్ణాయని, యేడి పించుచుంటివిగదా? ఇప్పుడీవేరువెల్లంకులను నెట్లుభక్షింతును? మీ రెప్పుడును యిటువంటివాటికలవాట్లు పడుచుండువారుగాన మీకభ్యాసము (ఆలోచించి) కాలెడు కడుపునకు మండెడుగంజిగతియైనట్లుయేమిసేయుదు. ఇటుదెమ్ము భక్షించెద; (భక్షించుచు) నాకునిద్రవచ్చుచున్నయది, ఇక నే కూర్చుండజాల.

హరి— అయ్యా! ఈపచ్చిక శయ్యపైని శయనింపుడు; నేనిందేయుండి మీకేమి హాయము రాకుండ ఖడ్గపాణినై గాచకొనియుండెద.

నక్ష—(స్వగతము) మాగురుని యానతిచొప్పున వీరల నీ మహాటవియొద్దకు జేర్చితిని. ఇక నీ భేతాళుని చేతులో పెట్టుబ్రతుకగలడో గదా, (అని గురకలుబెట్టుచు నిద్రబోవును)

(చంద్రమతి, లోహితాస్యులు నిద్రబోవుచుందురు.)

హరి—(ఖడ్గపాణియై) అంధకారబంధురంబగు, కాంతారంబున, పథశ్రమంబున నొడలెరుంగక, నిదురించుచున్నవారలు. (లోహితాస్యుని సమీపించి) ధరావర బృంద సుందర పదారవిందంబు లానందంబు నొందజేయు యీనందనుని యందంబీచందంబయ్యెగదా! పట్టీ! నిర్వక్రవిక్రమపరాక్రమంబున, ధరాచక్రంబం తయు, నేకచ్ఛత్రంబుగా పాలించిన యీహరిశ్చంద్రచక్రవర్తికి సుతుండవై పుట్టి యేమిపాటుగట్టుకొంటివి! (దేహముస్పృశించి)

తే॥ గీ॥ ఎండవేడిమిచేమేను • మండెననుచు
నాకలికినోర్వజాలనో • యమ్మయనుచు
కటికియుపవాసములచేత • కమిలికమిలి
తల్లిప్రక్కవరుండితే • తనయ! సునయ.

(చంద్రమతిని సమీపించి)

రాగమాలిక

సీ॥ నాటబాటల చేత • నలసియుండెడి లేమ
కఠినాతపంబుల • గందవలసె
మలయ మారుతముకే • బలుతపించెడి కొమ్మ
ప్రళయానిలములోన • బండ వలసె
భూపాల నతులచే • పూజలందెడు సాధ్వి
యే ప్రాపు లేకిటు • లేగవలసె
కోకిల ధ్వనులెగ్గి • కోలుసేయని కాంత
ఘన భీకరారభటుల్ • వినగవలసె

తే॥ గీ॥ తోడిసఖుల సహస్రము • ల్వీడి యిట్లు
గోడు గుడుచుచు నడవిన • గ్లాడవలసె
దేవ గాంధారి వేళల • దిక్కులేక
చేయితలగడగా నిద్ర • చెందవలసె.

(తెరలో కలకలము)

హరి—యేమిటాధ్వని? (అని ఆలోచించును)

భేతాళుడు—(ప్రవేశించును.)

మ॥ అగరే! యెవ్వడవోరి నా వటమహీ • జాగ్రంబు వీక్షింప నా
హరియైనన్ యజుడైన న పుర హరుం • డైనన్ యముండైన నా
సురలైనన్ మదిభీతి నొందెదరు నీ • శూరత్వమే మందునన్
ధరణిన్ నెవ్వడటంచు నెంచెదవు భే • తాళుం డటంచెంచుమా

పంచచామరము—పిశాచ నాయకుం డటంచు • భీతియైన లేక యీ
నిశీధి వేళ వచ్చినావు • నిన్ను మ్రింగివైతునీ
బిసాద దెంతనీవు యెంత • బిల్కుమార్చి వైతునా
కసాధ్యమైన కార్యమేది • కల్మషుండ నిల్వరా!

హరి—ఓహో! ఇయ్యడి భూతాలయంబు గాబోలు! అయిన శేమి (ప్రకాశముగా)
ఒరె పాతకీ! ఏవొక్కడవేగాదు. పదివేలమంది భేతాళులువచ్చినను భీతినొందుదు
ననుకొంటివా? ఏలగొంతు బ్రద్దలగునట్లు వాపోయెదవు!

భేతా— ఎట్లా? ఎట్లా?

పంచచామరం॥ కన్నుమిన్ను గానకిట్లు • కారులార్చె దేర న
న్నన్నగాదరంబె నీకు • నీచమానవాధమా
అన్నగారి యన్నవచ్చి • ఆదరించి బ్రోచినన్
వెన్నుదన్ని రొమ్ముగ్రుద్ది • వీకఁ జావ జేసెదన్.

హరి— అరిగజకంఠలుంఠన కంఠీరవంబగు మత్కరవాలంబుచే నీకంఠంబు ఖండించెద శుంఠా! ఏల నీకీ కంఠశోష?

పంచచామరం॥ ఒరే మదిన్ భయంబులేక • నోటికొచ్చినట్లు యీ
దురాగ్రహంపు పల్కులేల • దోర్బలంబదెంత? యీ
ధరాతలంబు దూరినన్ సు • ధాబ్ధిలోన జొచ్చినన్
శరాళిచే శిరంబు ద్రుంచి • కాలుద్రోలి కంపెదన్.

(స్వగతము) ఇచట యుద్ధంబు సలిపిన వీరికి నిద్రాభంగంబు కలుగును. వీని కావలకు గొంపోయి యుద్ధంబు సలిపెద. (ప్రకాశముగా) ఒరే భేతాళా! యుద్ధంబు సేయుదము రమ్ము.

(అని యిరువురు తెరలోకి వెళ్ళుదురు.)

నక్ష—(నిద్రమేలుకొని గడగడ వడంకుచు) అమ్మయ్యో? చచ్చితి, చచ్చితి, (అని అటునిటు పరుగెత్తుచు చంద్రమతి లోహితాస్యులను లేపి) యమ్మరోయి, అదుగో, అదుగో, వచ్చె, వచ్చె, చంపె, చంపె, అబ్బో, అబ్బో, అదేమి భూతము (అని గడగడ వడంకుచు పుడమిపైబడును.)

చంద్ర—(స్వగతము) ఈ బ్రాహ్మణుండేదియో యొక భూతంబును జూచి యింత భయంబు నొందుచుండె. (దిక్కులు పరికించి) మహాత్ముండేడీ? (నిదానించి) మహాత్ముండా భూతంబుల నంత మొందించ బోయి యుండును.

(తెరలో) హరిశ్చంద్రా! రక్షించుము. రక్షించుము.

చంద్ర—అదే మహాత్ముండా భూతంబుల నంత మొందించి వచ్చుచున్నట్టు లున్నయది.

హరి—(ప్రవేశించి) వటూత్తమా! సుఖంబుగ నుంటివా?

నక్ష—(కోపముతో) సుఖముగా నుండకేమి? నోటితో బొమ్మవలె నన్నిటుల తొందరగొట్టి వెళ్ళగొట్టుటకే భూతంబులందు బుట్టి యొద్దకుజేర్చి యొంటరిని జేసితివా? చాలు, చాలు, ప్రసంగమంతయు జరిగె; ఇక నేనిట నుండను,

మీయిష్టము; మీరిక్కడ నుండండి, చావండి, నేనిదే పోవుచున్నాను. (అని పోబోవును.)

హరి—(అడ్డముజని చేతులు పట్టుకొని) ఈ యర్ధరాత్రమున నెచ్చటికి బోయెదరు? కొంచెము సేపోర్చుకొనుడు. అటులనే పోవుదము.

నక్ష—(చేయి విడిపించుకొని) ఇక నేనుండను; అదుగో, భూతము చంపును.

హరి—అయ్యో! అది దచ్చినభూతము.

నక్ష—అది చచ్చినభూతమా? యేదీ చూతముపో.

(అందరు ఆచచ్చినభూతము దగ్గరకు పోవుదురు.)

విశ్వా—(ప్రవేశించి) నేనెన్ని పన్నగములబన్నినను యిన్నరవాయకుం డనృతమాడ కున్నవాడే! కానిమ్ము. ఎన్ననాళ్ళనృతమాడకుండునో చూచెదగాక. నేనిప్పుడేచని మత్తపోమహిమచే నగ్నిదేవుని, మేఘుని, వాయువుం, జే సికొనిరాళ్ళ వర్షంబుగురిపించి దవానలంబీ కానసం బంతయు గ్రమ్ముకొను నట్లు జేసెద (నిష్క్రమించును.)

(వర్షమారంభించెను.)

హరి—దరిద్రుని పెండ్లికిపడగండ్లవాన యన్నట్లు ఉరుములు మెరుపులతో వర్ష మారంభించుచున్నదే, నేనేమి సేయుదు? (చంద్రమతి వంకజూచి) సతీమణీ! యీవాతుమారుని దీసికొనుము, నేనిప్పుడుని గాపాడెదను. (నక్షత్రకునితో) పటూత్తమా! ఈ వృక్షము క్రిందనుండుము. (అని చేయిపట్టుకొనబోవును.)

నక్ష—(చేయి విడల్చుకొని) రాళ్ళవర్షంబుచే నావీపు జల్లెడ తూట్లాయినది. (అటు నిటుపరుగెత్తుచు) అవిగోఅవిగో పెద్దపెద్ద బండలు పడుచున్నవి. నీశాకే లేక పోయినను నాపీడ పోయునుగాని నాకు కడగండ్లు వచ్చినవే!

శా॥ రాలుల్ రప్పలువచ్చి పైబడి శరీ • రం బల్లకల్లోలమై
కూలారన్ గమకింపుచుండె పిడుగుల్ • గుండెల్లు ఝల్ మంచనన్
నుల్లంబల్లట తల్లటయ్యె గదనీ యు • ద్దార కత్యంబునన్
నల్లాడాకులు మేయుచుంటి గదయో • న్మాక్కైన నింతేకదా?

హరి—విప్రవర్యా! వర్షమాగిపోయినది. ఇకమీఋణంబు దీరు నుపాయంబాలో చించు తెంపుకలెపను జేయుదుముదంచు.

ఉ॥ తూరుపు తెల్లవారె నల • తోయజ మిత్రుడు తూర్పుకొండపై
సారసముల్ హసింపగ వి • చారుబచారులు సేయుచుండె నా
సారతుషారముల్ యడగె • చాతక ముల్మటు మాయమయ్యెనీ
ఘోరట వెందిరం జిచట • నుండెట కేనియు బోవ వేగమే

(అగ్నిచిట్టు ముట్టును.)

కలికీ! ప్రళయకాల ఫాలలోచనానల శతంబులనదగు దావానలంబు మనసలు జెసలం గ్రమ్ముకొనినయది. ఇక వెలికొచ్చు టెట్లు?

చ॥ అడవుల లోపలన్ దిరిగి • యాకలమైన నొకింత మెక్కి యీ
పుడమి జనింత మన్నసతి • బూనినకర్మము వహ్ని రూపమై
వెడలిటు వచ్చె పైకితెర • వెయ్యదియో యెరుగంగరాదు యీ
యడవిని నేటితో మనల • కాయువుదీరె నటంచు నెంచుమా

భాసురాంగీ! ఈదివసంబున, కాశీపురంబు జేరి, కౌశిక ఋషీంద్రుని ఋణంబు నిశ్శేషంబు జేయుదమని, గంపెడాసతో నుంటిని, ఆయాసయంతయు, నిరాశయయ్యె ఏమి సేయుదము!

చంద్ర—ధాత్రీశ్వరా! మీనిత్య సత్యవ్రతాతిశయంబు, పరిశోధించ విశ్వామిత్ర ప్రేరితంబైన వీతిహోత్రంబుగాని యేయవాంతరంబును గాదు. గానమన కెంత యెంత యవాంతరంబు లొచ్చినను ప్రాణంబులంత మొందించినను మీయంతరంగంబున చింతనొందక నిత్యసత్యవ్రతాతిశయంబె మాత్రంబైన కోరంత సేయకుడు.

హరి—చావదలంచు వానికి, సముద్రంబు, మోకాటి లోతనునట్లు బ్రహ్మాండకటాహంబెల్ల నిండి మండుచవచ్చెడి యీ కార్చిచ్చులో జొచ్చెద. నాకై రిచ్చపడక మునికిచ్చవలసిన ఋణంబిచ్చివేయుడు. మదీయప్రాణాహుతులచే మెచ్చి వైశ్వానరుండు మిమ్ముల దరిజేర్పగలండు. (అనలము జొరబోవును)

చంద్ర—(అడ్డముజని)

ద్విప॥ ప్రాణేశా నినుబాసి • బ్రతుకగా గలనే
మానుగ నను వీడ • మర్యాదయౌనే

హరి— అతివరో మనమిట్టు • లాయాసపడగ
ధాత్ర వ్రాసిన వ్రాత • తప్పునే తొలగ

చంద్ర— ప్రాకటముగ నిన్ను • బాసి యెట్లోర్తు
నాకాజ్ఞయిమ్మి యీ • యనలంబు జొత్తు

హరి— అతివరో నినుబాసి • బ్రతుకగ గలనే
సతిలేని బ్రతుకిల • సార్థకమగునె

చంద్ర— సతిబోవవేరొక • సతిని బెండ్లాడి
సుతులబడయగవచ్చు • సుదతినిగూడి

హరి— హరిహరి యీమాట • లనదగునటవె
ధరనినుబాసి యీ • తనువుండునటవె?

లోహితాస్యుడు. (యేడ్చుచు కన్నులు నులుముకొనుచు).

లో— . అమ్మ నీవెచటికి • అరిగెదవమ్మ
ఇమ్మహి నినుబాయు • టెట్లుమాయమ్మ

చంద్ర— (కుమారుని దగ్గరకు తీసికొని)

చంద్ర— ననుగన్నతండ్రిరో • నాముద్దులయ్య
ఘనముగ మీయయ్య • కడనుండుమయ్య

లోహితాస్యుడు (తల్లిని కౌగిలించుకొని)

లోహి— అయ్యనువిడచి నా • యమ్మరో నీవు
చయ్యన యెచటికి • చనబూనినావు

చంద్ర— నినుబాసినేనెటు • నిల్వసేర్తునురా
అనలము జల్లార్ప • నగు సుకుమార

నక్ష—(భయహాశ్చర్యములతో) (స్వగతము) మొగమాటమునకు బోయిన నెవరికో యేమి యయ్యెనన్నట్లు వీరందరు చచ్చిన తరువాత మాబాకీ యెవరిచ్చెదరు! (ప్రకాశముగా) ఒరే! నృపాధమా! మీరంద రొప్పగింతలుబెట్టి నిప్పులో దూకుచున్న వారలే మాయప్పెవ్వ రిచ్చెదరు?

హరి—విప్రోత్తమా! ఎన్నితిప్పలయినను బడి మీయప్పు దీర్చెదముగాని యెగ వేయ తలపెట్టువారము గాము.

చంద్ర—నాథా! నాకాజ్ఞయిమ్ము.

హరి—(ఊరకొనును)

చంద్ర—(అగ్నికెదురై చేతులుజోడించి) హా! పీతిహోత్రా!

సీ॥ అండపిండాండ బ్ర • హ్మాండము ల్దగనిండి
మెండుగా జరియించు • చుండు నెవడు
పతిసహగమనమే • యతిహిత మనియెంచు
సతులకు ననురూప • గతుడె వండు
రాజసూయమహాధ్వరంబులం దెవ్వాడు
నాజ్యాహుతుల్ గొను • పూజ్యుడెవడు
యోగుల కనరాగ • భాగధేయుడు గాగ
పగలు రేయును వెల్గు • ప్రౌఢు డెవడు

తే॥ గీ॥ జంట మోములు గలయట్టి • సామి యెవడు
శ్రోత్రియత్వంబు గల పరం • జ్యోతి యెవడు
సర్వభక్షకు డైనట్టి • సరసు డెవడు
కరుణ నాతడె నన్నిప్డు • గాచు వాడు.

ఓ జాతవేదా!

సీ॥ పతియె దైవతమని • సతతంబు మతియందు
భావించుచుండెడి • పడతి నేని
సకలసద్గుణమూర్తి • సత్యహరిశ్చంద్ర
చక్రవర్తికి సహచారి నేని
సకలదేవతలను • సమదృష్టితో గాంచి
మ్రొక్కుచుండెడి మాట • నిక్కమేని
యుత్తమామల యాజ్ఞ • కడుగుదాటక యెప్డు
పరిచర్య సలిపెడి • తరుణి నేని

తే॥ గీ॥ పరపురుషులందు సోదర • భావ మేని
అల త్రిశంకుని కోడలే • నౌదు నేని
యనృతమనుమాట లాడని • అతివ నేని
శీతలుండవు గమ్మిహా • వీతిహోత్ర.

(అగ్నిలో ప్రవేశించును. అగ్ని జల్లారును.)

నాథా! నమస్కారములు.

హరి—దీర్ఘసుమంగలీభవ

లోహి—(తల్లిని గౌగలించుకొని)

తే॥ గీ॥ నిన్నుగానక నేనిట • నేడ్చి యేడ్చి
అమ్మనిటుజూపు మంచునే • నయ్య నడుగ
యయ్య కూయిడజాలక • కొయ్య యయ్యె
యమ్మవచ్చితె నాదిగుల్ • వమ్ముగాగ

హరి—అతివా! నీపతివ్రతా శీల, సౌజన్యంబులచె యీవిటిహోత్రుని శీతలుం జేసితివి; నాకపకీర్తిరాకుండ యీధాత్రీసురుని రక్షించి నీచరిత్రం బీధాత్రిలో నా చంద్రార్క స్థాయిగా ప్రతిష్ఠించితివిగదా.

చంద్ర—నాథా! నన్నిట్లగ్గించకుడు. మీనిత్యసత్య వ్రతాచరణంబునసే యీవిటి హోత్రుని శీతలుం జేయ గలిగితి.

హరి—(నక్షత్రకుని సంకజూచి) భూసురవర్యా! కాశికాపురంబింక నరకోసెడుమారం బున్నది; మీరలలసట, నొందక వేగరండు.

నక్ష—(కోపముతో) చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా యనినట్లుఅలసిన నేమి సొలసిన నేమి అనుభవించక తప్పునా? నీసవ్వడిగన హాసవిషంబుగా దోచె. అశజెప్పి కాలంబు బుచ్చునట్లు దోచుచున్నయది. ఇంతపసగలమానిసివచ్చితివని కాశిలో రాసులు బోయుదురాయేమి? చాలు చాలు రోసముగల మానిసివైతే మాపైస లీసరికిమ్ము. లేక మాకసలే రొగవేసితినను. ఎల నన్నిట్లసులుసులు జేసెదవు. మా బాకీయిచ్చి కదలుము (అని హరిశ్చంద్రునికొట్ట బట్టుకొనును)

హరి—అయ్యా! నట్టడవిని అష్టకష్టంబులంబడి కొట్టుకొను నారట్టబట్టుకొని బాకీకట్టుమని, నిష్ఠురో క్తులాడిన నేనిట్లు సేయుదు? ఎట్టికష్టంబులైననుబడిమీ బాకీకట్టుదు గాని ఎగవేయ తలపెట్టువాడను గాను.

నక్ష—ఇచ్చేదానికింత రచ్చ ఎందులకు—

చంద్ర—అయ్యా! ఇన్నిదినంబులు మన్నించి యిపుడిట్లు బన్నంబులొందజేయుట యీనగాచి నక్కలుపాలు జేయుటగాదే!

నక్ష—మిమ్ముల నీదినంబున మన్నించి రొక దినంబు గడువిచ్చితి. ఇక నాగడువు దప్పితిరా మీరుపడుపాట్లు భగవంతుని కెరుక.

హరి—అప్పులేకపోయిన నుప్పుగంజియైనా మేలుగదా?

చంద్ర—నాథా! అనల్ప శిల్ప కల్పనాకరంబగు యీపురంబేనా కాశికాపురంబు?

హరి—(చేతితో జూపుచు) మానినీ మణీ!

సీ॥ సతతాగమాఖ్యాన • శ్రవణానురక్తులౌ
భూసురులుండునీ • పురవరంబు
ప్రకటిత మణిమయ • ప్రాసాద యుతమునై
పొలుపారుచుండు నీ • పురవరంబు
నిఖిలపాపంబుల • నిర్మూలనము సేయు
భావంబు గలది యి • ప్పట్టణంబు
నిఖిలదేశాధీశ • నిర్మలానందమై
సురపురి మించునీ • పురవరంబు

తే॥ గీ॥ యోగిజనవాసి భక్తుల • భాగ్యరాశి
సకలసుఖముల నొడగూర్చు • సౌఖ్యరాశి
పుణ్యముల కెల్ల నిదియె • సంపూర్ణ రాశి
వనిత గన్పడుచున్నదే • వారణాసి.

చంద్ర—మనోహరాంగరంగదుత్తుంగ తరంగసంగతయగు గంగయదియేనా?

హరి— తే॥ గీ॥ హరునిశిరమందు పుష్పమై • నాడునెద్ది
సగర సుతులకు మోక్షంబు • సల్పెనెద్ది
జహ్ను మునికర్ణమందున • జాతయెద్ది
గంగ యల్లదె జూడుమా • కంబుకంఠి.

మనమీ మిన్నేటిలో స్నానంబు జేసి అన్నపూర్ణేశ్వరుల దర్శింతము రండు.

(అందరు నిష్క్రమింతురు.)

విశ్వా—(ప్రవేశించి) వీరి నొకరినొకరు జూడకుండ నెడబాపినగాని నాప్రతిజ్ఞ నెరవేరదు. (ఆలోచించి) ఇప్పుడే కాశీపురము జేరి యీనువారలను యేర్పరచెద.

(నిష్క్రమించును.)

తృతీయాంకము.

సంపూర్ణము.



# అభినవహరిశ్చంద్ర.

## చతుర్థాంకము.



### కాశీవిశ్వేశ్వరుని దేవాలయము.

"హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు, నక్షత్రకుడు"
అర్చకుడు-పళ్లెరముపట్టి యుండును.)

హరి—(విశ్వేశ్వరుని కెదురుగా చేతులుజోడించి)

తే॥ గీ॥ సత్యపథమును వీడగా • జాలనయ్య
బొంకులాడుటకును మనం • బొప్పదయ్య
యెక్కరణిధన మిటనాకు • జిక్కునయ్య
నీవె కాశీశ! దిక్కిక • నేలుమయ్య.

చంద్ర—తే॥ గీ॥ కౌశికఋషీంద్రు డిటులైన • గానిమమ్మ
ననృతమాడింప ప్రతినగై • కొనియె. నమ్మ
ననృతరహితాత్ములయ్యెందు • నట్లుమమ్మ
నిగమవేదిని యోగౌరి • యేలుమమ్మ.

లోహి—ఆ॥ వె॥ జడలదాలియప్పు • నిడలేక మాయయ్య
తత్తరిల్లుచుండె • చిత్తమందు
అయ్యకుందుమాన్పి • చయ్యనబ్రోవుమా
కాశికాపురీశ • కలుషనాశ.

సత్య— తే॥ గీ॥ అవనినాథుని సత్యవ్రతంబు • లాడకేయ
బూనియున్నాఁడు మాగురు • పుంగవుండు
ప్రతిన నెరవేర్పు మయ్యనే • ప్రస్తుతింతు
కలుషసంహార యోకాశి • కా పురీశ.

(అర్చకుడు "మంత్రపుష్పమును జెప్పుచు") అయ్యా? విబూదియు పత్రియు పుచ్చుకొనుఁడు (అని యిచ్చును-)

(అందఱు పుచ్చుకొని నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము.

### రాజ వీధి.

(హరిశ్చంద్రుడు, చంద్రమతియు, లోహితాస్యుడు, సత్యవ్రతుడు, ప్రవేశింతురు.)

సత్య—రాజా! భూజలని, పురసౌధములని, యున్నావిట్లు, జరిపెదవు?

మ॥ గడువాదాపున కొచ్చె,మాకునిడు రొ • క్కంబాక్క-కాసైననీ
కడనాగన్పడదాయె; నోర్పుటకి కం • కాలంబు లేదాయె; నీ
యెడనా నమ్మికబోయె; యిత్తునని యి • ట్లెన్నాళ్ళు యేడ్పించెదో
పడుపాట్లంబడి బాకికట్టుమిక నీ • పంచాయతే యేటికిఁక.

హరి—పుడమీశ్వరా! గడువుదాటిన, నేనిడననియా, మీయడరు? అటులెన్నఁడు జేయువాఁడనుగాను.

సత్య—(ఆగ్రహముతో) ఎప్పటికప్పుడు తప్పించుకొను మాటలు జెప్పుచుంటివి వినొప్పుకొనను. మాధనంబిప్పుడే యిప్పుబోయును. లేకయున్న నిను ముప్పు తిప్పలుబెట్టి మూడుగుంటలనిన్ను తప్పక త్రాగించెదను.

హరి—(స్వగతము) (విచారముతో)

సీ॥ ఆహారమునకు చె • ట్లాకులే గతిగాని
పరసాన్న ఘృతపాయ • సములు సున్న
సొరుగా ధరియింప • నారచీరలెగాని
రమణీయ చేలాంచ • లములు సున్న

పడియుండుటకు నేల • పడకలే గతిగాని
తతహంస తూలికా • తతులు సున్న
నుండయా దరువులా • కొండలే గతిగాని
విమల సౌధాంతర • వితతి సున్న
తే॥ గీ॥ అకట దారిద్ర్య వశత న • ల్లాడుచున్న
నేనెటులదీర్తు ముని ఋణం • బిట్టులున్న*
గడువులోపల రొక్కంబు • లిడకయున్న
విప్రు చేతిలో బ్రతికెదు • విధముసున్న

(ప్రకాశముగా) అయ్యా? కొంచెమోర్పుకొనుడు. ఎట్లయినను మీఋణంబిచ్చి వేయుదును.

నక్ష—ఏవియ్యుడము లేదని చెప్పిన దెప్పుడు?

ఉ॥ హెచ్చుల కామునీశునకు • నిచ్చెదనంచు వచింపనేల? న
న్నచ్చట నుండియే తరువుకై • తగ మాగురుడంపనేల? నే
నిచ్చట నీదు జీవమున • కేడ్చుచు పస్తుల బండనేల? నీ
యిచ్చుటొ చచ్చుటో యొకటి • యేర్పడ దెల్పిన తేటయౌనిక.

ఓర్చి యోర్చియే యింతవరకు వచ్చినది. ఇక నీతో ముచ్చటలేల? మాబాకీ యిచ్చువరకు, మీకాళ్ళు, చేతులకు, సంకెళ్ళువేసెద.

(హరిశ్చంద్రునికి, చంద్రమతికి, సంకెళ్ళువేయును.)

హరి—తరళవృత్తము.

పరమపూరుష భక్తపోషక • పావిశేష విభూషణా!
దురితదూర పరాత్పరా యఘుదూర కావర శ్రీవరా!

చంద్ర—

కరుతోడుత మమ్ము బ్రోవర • కాంచనాంబర భూవరా
అరయనాధుని జాడలేనిక • యాపదల్ యెడబాపరా!

హా పరమేశ్వరా! పూర్వజన్మంబున నెవరికేమపకారంబు నల్పితిమో యిపుడీ యాపదలకు పాలుపడనలసె;

లోహి...(నక్షత్రకుని చేతులు బట్టుకొని.)

ఆ॥ వె॥ తల్లి, తండ్రి యిట్టు • లల్లాడుచుండ నా
యిల్లు మెల్ల తెల్ల • డిల్లుచుండ
బాపనయ్యనీకు • పదివేల దండముల్
బెట్టువాడ వీరి • కట్లువిడుపు

లోహి—(తల్లితండ్రి యొద్దకుబోయి కట్లు విడువబోవును.)

నక్ష—(పరుగెత్తి లోహితాస్యుని పట్టుకొని) ఓహో? పిట్టచిన్నది కూతలు పెద్దవనెడు రీతిగా, మిట్టిమిట్టి పడుచున్నాడవే నిన్నిక విడిచిపెట్టగూడదు. (అని లోహితాస్యునకు సంకెళ్లు వేయును.) (రాజువంక తిరిగి) రాజా! సిపిచ్చుగుదిరినదా! పిచ్చివాడా! ఏలతచ్చనలాడెదవు? ఒక్క అసత్యమాడిన నీకష్టైశ్వర్యంబులు రాగల్గునట్లు జేసెద నిన్నప్పుడె విడచిపుచ్చువాడను. ఏల యీకష్టంబులంబడి చచ్చెదరు!

హరి—అయ్యా' ఈకాయంబు గాయంబై మాయమైనను నేనియ్యజాలనని పలుక జాలను.

నక్ష—చింతవిరిగినను పులుసువిరుగలేదే ఇక నీయంతు గనుగొనియెద.

లోహి—(ఏడ్చుచు) తే॥ గీ॥ ఎంచిమీరొక్క మిప్పుడే • యిత్తుమయ్య
కాళ్ల చేతులువిప్పు న • క్షత్రకయ్య
ఓర్వగాజాల నయ్యనన్ • బ్రోవుమయ్య
బాధనొందగ జాలనో • బాపనయ్య

నక్ష—బాలుని జాలిమాటలకు నామదికలంగి మిమ్ముల విడచుచున్నవాడ. లేక యున్న మిమ్ములనింక తంటాలు పెట్టవలెననియే నాకోరిక. (అని కట్లు వూడదీయును)

చంద్ర—(స్వగతము) మునిఋణం బెట్లుదీర్తునాయని మన్మనోనాయకుండతిఖిన్నుండై యున్నవాడు. నన్నమ్మియైన నాముని ఋణంబు తీర్పుమని మనవి జేసికొనియెద (ప్రకాశముగా) నాథా!

ఉ॥ చింతను బొందియుంటయిట • చేకురుసే ధనసంచయంబు మీ
స్వాంతమునందు నూల్కొనిన • సంశయమెల్లను బోనడంచి న
న్నంతకునైన నమ్మి ముని • కీదగియుండిన బాకియందు గో
రంత గొరంత బెట్టకిడు • మా గనుమా ధరలోన కీర్తియున్॥

హరి—సతీమణీ! నీయట్టి పతివ్రతాతిలకంబు నమ్ముటకు నాచేతులెట్లాడును? హా! దైవమా! మాకింత విపరీతకాలంబు తటస్థింపజేసితివి.

సీ॥ అడవుల నిడుములు ♦ కడుసుఖంబులెయగాట
నీకతంబునగాదె ♦ నీరజాక్షి
కఠినాతపంబుల ♦ గందకుండెడుజాడ
నీకతంబునగాదె ♦ నీరజాక్షి
చింతలెల్లపుడు ని ♦ శ్చింతగా మారుట
నీకతంబునగాదె ♦ నీరజాక్షి
కాల్చిచ్చుబడనీక ♦ కాపాడుటలుచూడ
నీకతంబునగాదె ♦ నీరజాక్షి

తే॥ గీ॥ రమణి సుకుమారి వయ్యారి ♦ రాకుమారి
కరుణబోదూరి వీధుల ♦ దరికిజేరి
ధరకు గొనుమంచు నేను యె ♦ వ్వారినిజేరి
యమ్మగా జూతునయ్యయో ♦ హద్దుమీరి

చంద్ర—ప్రాణేశ్వరా! మూఢుని చందంబున గోడుగుడిచెదరేలా? గతియతడవైన నన్నృతమాడించ నడుపుగట్టుకొనియున్న జడలదారి గడుసురయరంగదే? ఇకతడయుట పాడికాదు. ఇంతట నన్నొకరికైనను పోకడబెట్టి జడలదారి ఋణంబు దీర్చుము.

హరి—కలికీ! కులసతుల నమ్మికొనువెకలికొంద్రైనన్ గలడే?

చంద్ర—దేహ, గేహ, కాల, ధన, ధాన్య, విద్య, లెవ్వరు సజ్జనులకై వినియోగింతురో వారికి హపరంబులయందు కీర్తిగలుగును. గాన నిమోహపాశంబు లదుగంట విడచి నన్నమ్ముట కంగీకరింపుడు.

నక్ష—నేటితో గడువెళ్ళిపోవుచున్నది. ఇల్లిడుములు బడనేల! ఈ పడతిదప్ప నీకే యాస్తియు లేదే, ఇక నిపడతిని, నడువీధిలో పోకడబెట్టి మాఋణం బిడుము.

హరి—హా! పరమేశ్వరా!

చ॥ అపరిమితానురాగ రస ♦ యాచు మదాశ్రయ మొంది యెప్పునా
యుపచరణంబునన్ వినువు ♦ నొందక నర్థిజనానుకూలయై
యుపయశముల్ గణింపకెపు ♦ డాపతియే గతిగాగ నెంచునీ
నృపకులజాత నమ్ముటకు ♦ నీతరినోరెటు లాడుదైవమా,

చంద్ర—మనోనాయకా! మీ రనుమానింపక నన్ను విక్రయింపుఁడు.

హరి—హా పరమేశ్వరా! పూర్వజన్మకర్మం బీలాగున దాఁటిదీయుచుండ నిఁక నేమి చేయ గలను. ఇఁక ధైర్యమూని భార్యావిక్రయమున కుపక్రమించెద.

నక్ష—(కోపముతో) ఎందులకయ్యా యీ యాలస్యము?

హరి—అయ్యా! తమరే యీపనికి బూనుకొనుఁడు. నాకు నోరాడకున్నయది.

నక్ష—(మండిపడుచు) ఏమేమీ? ఇచ్చువున్నవారు పుచ్చుకొనువారు బాగుగనే యుండ నవలె నడుమ వచ్చినవారి మచ్చమాయవలెనా? ఈతుచ్ఛకార్యంబుల నేనొనర్చువాఁడను గాను. మాఋణంబిచ్చుటకు మనంబున నిచ్చగించితివేని యిచ్చివేయుము. లేకున్న యివ్వనని చెప్పుము. నేను వచ్చినదారి బట్టెద (అని పోబోవును)

హరి—(నక్షత్రకుని బట్టుకొని) ఆగ్రహ మొందవలదు. ఇప్పుడే యమ్మెద. ఓకాశీ వాసులారా!

సీ॥ పరమేష్ఠికిని దీటు • పటిమ గల్గినయట్టి
భూసురవరులార • పుణ్యులార
మదనసంహారునైన • కదనంబున జయించు
తేజముల్ గల్గిన • రాజులార
నలకూబరునితోటి • నగతు గల్గినయట్టి
స్వాశ్రయపరులార • వైశ్యులార
సేవకావృత్తియే • శ్రేయంబనుచు నల్వ
పాదసంభవులగు • భద్రులార

తే॥ గీ॥ సకలవిధమైన సంకర • జాతులార
విటుల నలయించుచుండెడు • వేశ్యలార
గాధినందను ఋణముకై • కాంతనిపుడ
యమ్ముచున్నాఁడ గొనరయ్య • యార్యులార!

నక్ష—ఏమీ! ఒకరును రారేమీ. ఎవ్వరికి వినరాకుండ, ఏనోటిలో, నీవు గొణుగుకొనిన నెవ్వరు రాగలరు? ఏదీ యింకొకసారి కేకవేయుము.

హరి—

సీ॥ అనృతంబులాడదీ • యతివలతిలకంబు
కలలోననైన • నవ్వులకునైన

పతియాజ్ఞ మీరదీ • పరమపతివ్రత
మతిమరుపున్నైన • హితవున్నైన
పరుషంబు లాడదీ • పడతుల మేల్బంతి
వరులన్నైననుతన • వారిన్నైన
రోసంబు యెరుగదే • రోజున్నైనను
విసువులన్నైనయే • దెసలన్నైన
తే॥ గీ॥ ఏడుదీవుల నేలెనె • వ్యాడ్డోయట్టి
సత్యకీర్తి హరిశ్చంద్ర • చక్రవర్తి
సార్వభౌముని యిల్లాలు • సదయహృదయ
నమ్ముచున్నాడ గొనరయ్య • యార్యులార

(కాలకౌశికుడు. ఇరువురు శిష్యులు ప్రవేశింతురు.)

కాల—ఏమోయీ యిక్కడ భార్యనమ్ముడు పోరంబోకువాడు

హరి—ఇట్టి పాతకకర్ముడను నేనే

కాల—కొంతనమ్మెటుడు నీకంత గొంతుపై కత్తియేమివచ్చె!

హరి—రాబట్టియేగదా యీరమణి నమ్మెట

కాల—ఆలినొకరికమ్మెట అనుచితము గాదటయ్యా?

హరి—అయ్యా? వృథా ప్రసంగము లేల? నీకిష్టమైనగొనుము; లేకేని, వచ్చినబాట పట్టుము.

కాల—(నక్షత్రకునితో కలసి మాట్లాడి) అటులనా! నీవే యుంతటి కొనవచ్చినా?

నక్ష—విశ్వామిత్రునకు ఋణముకై యీతండీతని భార్యనమ్మ చిన్నవాడుగాన కొనవచ్చెను.

కాల—రాజా! ఆ విశ్వామిత్రునకేమైనా పత్రము వ్రాసి యిచ్చియుంటివా?

హరి—పత్రము లెందులకు! మనస్సే యొకపత్రము. సూర్యచంద్రులే సాక్షులు.

కాల—ఎంతెఱ్ఱివాడవయ్యా, నోటిమాటలే! ఆ సూర్యచంద్రు లేమి సేయుదురు? నీతరపువారు వకాల్తాయిమ్ము. సరియైన వాదనచేసి నీ బాకీయంతయు నొక్క మాటతో యెగురగొట్టి వేసెద.

నక్ష—రాజా! నీకు మంచిమద్దతు చిక్కినదే! ఇంతకన్న నీకు మంచి సమయంబు చిక్కదు. ఈయన చెప్పినట్లు చేయుము.

హరి—

పంచచామరము—రమాధినాథుడా స్త్రిశాలి • రక్షణంబు మానినన్
ఉమాసుతుండు బ్రహ్మచర్యముల్ • ద్యజించి వేసినన్
క్రమంబుదప్పి సాగరంబు • క్రందుగొనుచు వచ్చినన్
తమాష మాటగాదు నేను • దబ్బరల్ వచింపజూ

కాల—సత్కర్మము. నీవె యనుభవించుము నాకేమి. అయిన నీభార్యకెంత కష్టమైదవు చెప్పుము.

హరి—

తే॥ గీ॥ ఒక్క మనుజుండు యేనుగు • నెక్కి నిక్కి
యంతయెత్తుగ రత్నంబు • నెగురవైచు
నంతయెత్తు ధనంబిచ్చి • యతివె నిపుడు
వేగ గొనిపొమ్ము దాసి గా • విప్రవర్య

కాల—అబ్బో! ధరచాలా యెక్కువగానున్నదే! ఏమైనను తగ్గింపవా?

హరి—తగ్గింపజాలను. కాము కొనజాలకేని విడచిపొండు.

కాల—ఏష్టా? ఏష్టా? నన్నంత పేదబ్రాహ్మణునిగా దలంచితివా? పంపించుము. ధన మిప్పుడే యిచ్చెద

హరి...నక్షత్రకేశ్వరా? అధనం బప్పగించుకొనుము.

కాల...నీభార్య యేమేమిపనులు చేయును.

హరి...తమయింట దాసియై తనవిధాయక కృత్యములన్నిటి చేయును. త్రికరణముల యందును నింద్య కర్మముల నాపై దలంపదు.

కాల...ఆ, ఆ, నాకు తెలియును. (లోహితాస్యుని చాయజూచి) ఒరే పిల్లకాయ! ఈపంచాంగము దర్భకట్టలు తీసుకొనిరమ్ము, పోవుదము.

హరి—ఇదియేమి న్యాయము? తల్లిని విక్రయించితిగాని, పిల్లవానిని, గూడా విక్ర యించితినా?

కాల—హరిశ్చంద్రా? అవును గొన్న ఫుడు, మూడాగూడా కొంటరాదా? (నక్షత్రకుని చాయజూచి) నక్షత్రకా! ఇదేటి న్యాయము?

నక్ష—మాయప్ప యెగకేయవలయునని యీతిప్పలు బెట్టుచున్నావే గాని యీకాల కౌశికుడు చెప్పిన మాటయందు నధర్మమేమి యున్నది? అవును గొనినవాడు మాడను విడుచునా!

హరి—నక్షత్రకా! నేనే అధర్మవాదన చేయుచుంటినా? అట్లయిన గొనిపొమ్మనుము.

కాల—దాని! కదలవేమి? మాయింటి దసాధ్యురది.

చన్ద్ర—అయ్యా! నాధుని యనుమతి బడసివచ్చెద (హరిశ్చంద్రుని వంకకు దిరిగి) హా! ప్రాణపతీ! నేటితో మీసుందరముఖారవిందంబు జూచు భాగ్యంబు గూడ తీరిపోవు చున్నది గదా!

సీ॥ ధరణీసురుడు నన్ను • త్వరసేయ కయ మున్నె
కడువడి మీమోము • గాంచ నిందు
కొన్నవా రిటుల బై • కొని రమ్మనక మున్నె
యింపుమీరగ కౌగి • లింప నిందు
దాస్యంబు కై మీకు • దవ్వుపోవకమున్నె
నోరార నొకమాట • నుడువ నిందు
ఇటనుండి విప్రుని • యింటికేగక మున్నె
గట్టిగా పాదముల్ • బట్ట నిందు
తే॥ గీ॥ మరల మిముజూచు భాగ్యంబు • దొరుకనిందు
ప్రేమపాశంబు లిటదెంచి • పెట్టిపొందు
సూనృతము వీడకుండుటే • శుభముసుందు
జాగుసేయక నాకాజ్ఞ • వేగ నిందు.
(అని పాదములపైబడును.)

హరి—(దుఃఖించుచు) హా! నీచహరిశ్చంద్ర! నియర్ధాంగ లక్ష్మికా యిట్టి యిక్కట్లు?

సీ॥ తతహంస తూలికా • తల్పంబుల బరుండు
కమలాక్షికా యిట్టి • కఠిన సేవ
పరిచారికా జనుల్ • ప్రణుతి సేయుచునుండు
నేణాక్షికా యిట్టి • హీన సేవ
రంగు బంగరుసౌధ•రాజిపై వసియించు
పద్మాక్షికా యిట్టి • పాడు సేవ
యష్టభోగంబుల • ననుభవించుచునుండు
నీరజాక్షికెయిట్టి • నీచసేవ

తే॥ గీ॥ సార్వభౌముని యిల్లాలు ♦ సదయహృదయ
వరుల బడిపంచలకు బడి ♦ పనులుసేయ
వ్రాసెగా ఫాలు నజుడు నీ ♦ ఫాలమందు
పూర్వభవమింత దప్పునే ♦ పువ్వుబోణి!

కాల—హరిశ్చంద్రా! నేను క్రొత్తగా దాసిని గొనిపోవుచుండగా నివిట్లమంగళకరంబుగా యేడువవచ్చునా!

హరి—అయ్యా! ఇంతకాలము సుఖంబుగానుండి యిప్పుడీ వియోగమునకు దుఃఖించుచుండ మీకే యమంగళకరము.

కాల—అట్లయిన, నిజముగ నిల్లు వదలునట్లు యేడ్వుము (చంద్రమతి వంక జూచి) దాసీ! కదలవేమి? పుత్రా! రావేమిరా?

నక్ష—చంద్రమతీ! అధముని అలగుటకంటె, బలవంతునికి దాసిని యగుట మేలు గదా!

చంద్ర—(హరిశ్చంద్రుని కౌగలించుకొని)

సీ॥ పావనమూర్తియో ♦ ప్రాణేశ నినుబాసి
యేగగా వలసె వి ♦ రాగనగుచు
హరి— కలకంఠకంఠి యో ♦ కాలకౌశికునింట
యెటుల మెలంగెదో ♦ యింతి యకట!
చంద్ర— యెట్లైన గానినే ♦ నటమెలంగెదగాని
మీరింక చింతచే ♦ మెలగవలదు
హరి— యలివేణి లోహితుం ♦ డాకలికిని నోర్వ
జాలడాతని నెట్లు ♦ నేలగలవొ?
చంద్ర— తావక సత్యవ్ర ♦ తాచార మహిమచే
మనమెల్ల సుఖముగా ♦ మనగగలము
హరి— కలరాజ్యమెల్లయో ♦ కౌశికుండు హరించి
కడకీ విపద్దశల్ ♦ గనగజేసె
చంద్ర— ఆపదల్ మనకెన్ని ♦ దాపరించినగాని
నీమది సత్యంబు ♦ నిల్పవలయు

హరి— కలవాణి నిను బాసి • యిలలోన నేనెట్లు
నిలువఁగ నేర్తునే • నీలవేణి!

చంద్ర— తే॥ గీ॥ ప్రాణనాథ! మీరిట్లు • యడల నేల?
ధాత వ్రాసిన వ్రాతను • దప్పఁగలమె?
దైవకృపయున్న మరల నీ • దర్శనంబు
గల్గు తథ్యంబు నమ్మునా • కాజ్ఞయిమ్ము.

కాల—"డబ్బుబోయి, శనియుబట్టె" నన్నట్లు కదలిరానియ్యవేమోయి.

హరి—(దుఃఖించుచు) ప్రాణేశ్వరీ! వెళ్ళిరమ్ము.

లోహి—(తండ్రిదగ్గఱ జని) జనకా! మీరిట్లేల, దుఃఖించెదరు?

హరి—(లోహితాస్యుని దగ్గరకు తీసుకొని)

ఉ॥ అన్నము పున్నముం గొనఁగ • కాటలబాటల దేలిపోలు నీ
చిన్నతనంబు చేష్టలతి • చిత్రములయ్యెను నేటిదాక; యిం
కెన్నఁడు గందునో తుదకు • నేగతియౌనో యెఱుంగరాదు సం
పన్నుని యింటబుట్టి పసి • పంచల నుండఁగనాయె నక్కటా!

తండ్రీ! మీతల్లివెంట బొమ్ము.

చంద్ర—నాయనా! లోహితా! రమ్ము. (పతివంక జూచుచు సుతునితో చనును.)

హరి—నక్షత్రకా! నీవాధనం బప్పగించుకొనుము.

కాల—నావెంటరమ్ము ధనమిచ్చెదను. (నక్షత్రకునితో నిష్క్రమించును.)

హరి—(చంద్రమతివంక జూచుచు) ఆహా! యేమి యీకాలవైపరీత్యము?

తే॥ గీ॥ అష్టభోగంబులందు నీ • యతివమిన్న
భూసురుని యాజ్ఞచే మూట • మోయలేక
నన్ను విడనాడు చింతచే • నడువలేక
మసలి చనుచుండె నాదుసా • మ్రాజ్యలక్ష్మి.

(అని క్రింద బడిపోవును.)

నక్ష—(ప్రవేశించి) ఆహా! ఏమిది! ఈరాజు మూర్ఛ మునింగియున్నవాడు. (దగ్గఱకు జని) హరిశ్చంద్రా! హరిశ్చంద్రా! (అని లేపి) ఏమిది? ఇట్లధైర్యము నొందుచుంటివి?

హరి—(ఉలికిపడినట్లు లేచి) నేనెచ్చటకు రావలయును?

నక్ష—మాగురువుగారి ఋణము దీర్చుటకు.

హరి—(దీనవదనముతో) వటూత్తమా! ఇప్పుడు నీవు వప్పగించుకొనినది? నీగురువుగారి ఋణంబుగాదా!

నక్ష—ఇప్పుడు నీవిచ్చిన ధనంబు నాబత్తెంబుక్రింద సరిపోయినది ఇక మాగురువుగారి ఋణమెవ్వరిచ్చెదరు?

హరి—(భూసురోత్తమా! ఇంత విత్తంబు బత్తెంబుక్రిందనే సరిపోవునా?

నక్ష—నవెంట కంటకారణ్యంబుల సంకటంబునొంద నీబంటనను కొన్నావారేమి?

హరి—అయ్యా! ముందా మునిఋణంబు దీరనిండు, తరువాత మీబత్తెముమాట ఆలోచింతము.

నక్ష—(కోపముతో) చేతివానిని విడచి కాలివానిని బట్టిన చందంబున నాచేతజిక్కిన యీ విత్తంబుచే యామునిఋణం బెత్తివేసి నాబత్తెపై గుడ్డవేసికొని పోవుట్లెనెదవా యేమి? చాలు చాలు; నియధిక ప్రసంగము.

శా॥ రేయుంచుం బవలంచునెంచకను దా • రిండ్లొంకయుం గానకే
సాయంబైనను లేక చచ్చిచెడి మూ • ర్ఛల్ మున్గచుం మూల్గుచుం
యాయధ్వాన్నపరణ్య మధ్యమున స • ల్లాడా కులం మేయుగా
నీయబ్బో మఱి తాత యేర్పరచెనే • నీక్రింద నేబంటనే?

హరి—విప్రోత్తమా! నన్నేల యీలీల తూలనాడెదరు? ఇంతకన్న చెడుదునా? ఇంక బాగుపడుదునా? నన్నెవ్వరికైన విక్రయించి మీబాకీ నిర్విశేషముగ దీర్చుకొనుడు.

నక్ష—ఈమాట మొదటనే చెప్పిన నాకింత శ్రమలోవ లేదుగదా! ఇప్పుడు నిన్నెవ్వరు గొనకున్న నేనేమిచేయుదును!

హరి—నక్షత్రేశ్వరా) ఎవ్వరు గొనకున్న తుదకు కడజాతివానికైనను విక్రయించుడు.

నక్ష—అట్లయిన నడువుము. (నిష్క్రమింతురు.)

## తృతీయ రంగము.

(కాలకౌశికుని గృహాంగణము)

(చీపురుకట్ట చేతబట్టుకొని కలహకంఠి ప్రవేశించును.)

కల—మాయింటి యీవాళ యింత ప్రొద్దెక్కినను వచ్చారుకారు; ముష్టి మాట లుమాయలేకనో లేక పైత్యములు బలమైనవో యీమధ్య దేహశుద్ధి చేయక పోవుటచేతనో? రానీ; కనుగొనెదను.

(కాలకౌశికుడు, చంద్రమతి, లోహితాస్యులు, ప్రవేశింతురు.)

కౌల—(వ్రేలితో జూపుచు) అదె నుబడునదే నాభార్య. అతిముక్కోపి. దీనిని జూచిన నాకే భయము. ఈ వూరివారందరు యీవూరివారేమి? కరణము,కాపులుకూడా దీని నోటికివెరచి, యీబజారుకు వచ్చుటకు వెరచుచుందురు. నీవెట్లు యీపెకడ మెలంగెదవో జాగ్రత్తసుమా!

చంద్ర—అయ్యా! మీ కొసందియం బేమియు వలదు; నేనతి జాగరూకతతో మెలంగెద.

కల—(కోపముతో) పిశాచీ! ఈమధ్య బొత్తుగా దేహశుద్ధి లేకపోబట్టియా యింత తడవు మసలితివి? ఈ మనిషి యెవరు?

కౌల—(భార్య సమీపమునకుబోయి) అమ్మే! ముసలివాడను ఇంత శ్రమపడి యెండ లోతిరిగి వచ్చినందులకు, నాశ్రమదీర నొకముద్దియ్యవే. (అని ముద్దుబెట్టుకొన బోవును.)

కల—(చీపురుకట్ట పెడమీద బెట్టిసెట్టి) వూరుబొమ్మనమని కాడురమ్మనమని పిలుచు చుండు ముసలిముండాకొడుకువగు నీకు ముద్దుగూడానా? నీముద్దుముక్కలు గాను (అని చీపురుకట్టతో బాదును.)

కౌల—(వీపు తడవుకొనుచు) అబ్బో! అబ్బో! కొట్టకే నీ పుణ్యము. (భార్యచేతులు రెండు పట్టుకొని) నే ముసలివాడనైనప్పటికి పౌరోహిత్యమునకు అపత్నీకు డంచారని పూర్వీకులు సంపాదించిన మాన్యమంతయు నమ్మి నిన్ను వివా హము చేసుకొనిన దిందుకేనా.

కల—ఇందుకుగాదు. పదియవవాడు నందడికి పిండిపుబ్బడానికి నీవల్ల యేసౌఖ్యము లేక పోయి నప్పటికి యింతపిండాకూడు అయినాదిని పెందలకడ పడియుండు టకు ప్రాప్తములేక నీజీవానికి యుసూరుమనుచు యేడువవలసివచ్చెగదా?

చంద్ర—అమ్మా! ఇలలోసతులకు పతియేగదా! దైవము? ఏల యిట్లవిపరీత మాట లాడెదరు!

కల—(కోపముతో) ఓహో! శ్రీరంగనీతులు చాల నేర్చినదానవే; నాకీనీతులు చెప్పుమని యెవరుబిలిచితే వచ్చితివి? (మగనిపైకిబోయి) వూరివారిచేత నన్నిట్లనిపించుటకు నీవెక్కడ దాపరించితివిరా? నీతలపండు బగుల (అని బాదును)

కాల—(భార్యచేతులు రెండునుబట్టుకొని) వద్దే, వద్దే, నన్నిట్లకొట్టు ఛావవే? (అని ముద్దుబెట్టుకొన బోవును.)

కల—(ముక్కులు మూసుకొని) ఈపాడు ముసలికంపు ముక్కులు చెక్కలై పోవుచున్నవి. ఇట్టినీతో కాపురమెట్లు దగులబెట్టుదును? అమ్మనీ యెవరో చెప్పెదవా లేదా! (అని పైకిబోవును)

కాల—(బ్రతిమలాడుచు) కొట్టకే, కొట్టకే, నీపుణ్యము, నావొళ్లంత పెట్లిపోవుచున్నది.

కల—దీనినెక్కడ దెచ్చితివో చెప్పెడిదాక మానను.

కాల—నీవు యింటిలోపనులు జేయలేక సంకటపడుచుండుదువని నేనివాలుగంటిని నీకు దాసిగాకొని తెచ్చితి. ఇక నీయిష్టమువచ్చినట్లు చేయించుకొనుము తల్లిమాత్ర నీకు గావలశిన పైపనులన్నియు యీ పిల్లవానిచేతనే చేయించుకొనుము.

కల—గబ్బునోటివాడా! మొదటనే యీసంగతిజెప్పిన దెబ్బలులేకపోవునుగదా? (చంద్రమతి వంకజూచి) నీవీదినము మొదలుకొని, ప్రతిదినంబును పెందలకడలేచి, యిల్లువాకిలిచిమ్మి, పేడనీళ్ళుచల్లి, ఆవుపేడచే, యిల్లువాకిలియలికి, పేడగలిపి,పిడకలుచేసి,తరువాతవడ్లుదంచి, మరల బ్రొద్దుగూకకమును పేసందెకసవూడ్చి,అవల మేము భోంచెడి కలో,యంబలో దాగి సంధ్యదీపములు ముట్టించి,మాకుపాన్పు యమర్చి మేము నిద్రబోవుదాక మాయింటియాయనకు వాని కాళ్లుపిసుకుము. (లోహితాస్యునివంకజూచి) ఒరేపిల్లకాయ! నీవిది మొదలుకొని,ప్రతి దినంబును రేపుమాపులు విపినంబునకు జని విస్తరాకులు దర్భలుతీసికొని, వంటకు యింధనంబుల దెచ్చుచుండుము. ఇట్లుచేయకేని మాబొబ్బలలో రాయిరప్పు, చాల ప్రొద్దెక్కినది. భోజనముచేయవలె సాగండి.

(అని నిష్క్రమింతురు.)

[హరిశ్చంద్రుని కొఱకు కొల్లాయపంచ నొక చెరుగుగట్టి ఒక చెరుగుకప్పుకొని నక్షత్రకుడు ప్రవేశించును.]

నక్ష—

సీ॥ కలరాజ్యమెల్లయు • గాధినందనునకు
దానమిచ్చినయట్టి • ధర్మదాత
పలికికొంకుటకన్న • పాపంబు లేదను
ప్రథమానకీర్తియౌ • పార్థివుండు
అపహాయుడై యొక్క • యరనిముసములోన
భేతాళునోర్చిన • భీమబలుడు
మునిఋణంబునకునై • తనప్రియురాలిని
విక్రయించినయట్టి • వినయశాలి
తే॥ గీ॥ ఏడుదీవుల నేలిన • యానృపాలు
డా త్రిశంకుమహారాజు • నసుగుసుతుఁడు
సత్యకీర్తి హరిశ్చంద్ర • చక్రవర్తి
నమ్మచున్నాడ గొనరయ్య • యార్యులార.

వీరబాహుఁడు—(ప్రవేశించును.) ఎవరోయి? మాశినమేమ్మది!

నక్ష—(స్వగతమున) వీడెవ్వడో మాలవాడుగా నున్నవాడే! ఏమిది దగ్గరదగ్గరకు వచ్చుచున్నవాడు?

వీర—అయ్యోర్వారు, చెప్పరేమి? (అనిదగ్గరకువచ్చును.)

నక్ష—(దూరముగాబోయి) మాదగముండాకొడకా! దూరముగానుండి మాట్లాడరా!

వీర—(మూతిమీదవ్రేలిడి) ఆ. యబ్బో, ఇంతదూరంగానుండాగాని రేంపడమంత్రమయ్యా;

నక్ష—నే నితనిని బానిసీగా నమ్మెచున్నాడను. ఇష్టమైనగొనుము లేకయున్న వెళ్లుము.

వీర—ఏమయ్యోర్వారు, యీయయ్యోర్వారు! కోపమెప్పుడూ ముక్కుమీదనే యుంటుంది. సరేకాని, యీమాలిని యెంతకిత్తువో చెప్పుము?

నక్ష—

తే॥ గీ॥ ఒక్కమనుజుండు యేనుగు • నెక్కి రత్న
మెగురవేసిన నదియెంత • యెత్తు జనునొ
నంతయెత్తు ధనంబివ్వ • నగుదువేని
వీనిగొనిపొమ్ము బానిస • వానిగాగ.

హరి—(విచారముతో) అయ్యా! నన్నియంత్యజునకే విక్రయించెదరా!

నక్ష—అయితే, నన్నేమిచేయమనెదవు? తిరిగి తిరిగి కాళ్లు బ్రద్ధలయి పోవుచున్నవి. అరచి అరచి గొంతునొప్పి యెత్తుచున్నది; ఇంతకన్న మీకేమియు బాకీలేద నిన నొక్కమాటతో నియిక్కట్టు తొలగిపోవునే.

హరి—(దుఃఖముతో) హాహాతవిధీ! నన్నింతనీచదశకు పాలుపడజేసితివి? (నిదానించి) (ప్రకాశముగా) అయ్యా! నటూత్తమా! కోపగించుకొనక మీయిష్టము వచ్చిన వానికే విక్రయించుడు.

వీర—అయ్యోరు! ఇంతధరపెట్టి నాకెందుకయ్యా?

నక్ష—మరి నీకల్లుముంతకే వచ్చునను కొంటివా? నిచేతయేమగును? పొమ్ము.

వీర—నాకంటె కొనేవాడీపాటి మీదొదుండాడు? రావయ్యా బాంబడా! డబ్బిత్తా

నక్ష—మీమాలమాదిగ యిండ్లకు బ్రాహ్మణులను విచ్చెదమటరా?

వీర—అయబ్బో! నేపెద్దింటోణ్ని గదటయ్యా.

నక్ష—పెద్దింటోడివో, చిన్నింటోడివో, పీనిగమీద పిండాకూళ్లు దినేవెధవవు.

వీర—మేము పీనుగమీద పిండాకూల్లు దినోల్లము. మీగు. శాద్దాలమీద పిండాకూల్లు దినోల్లు. మీకు మాకు యేంబేదముంది. ఇప్పటయ్యోర్లకు యీవేదాలు లేదె ఇత్తేచాలుగాని, యెలిజాతి మాలోల్లింతికైనా పలుగెత్తుకొని వత్తురు. నీకంత యిష్టము లేకున్న దూరంగా నుండు.

నక్ష—సరే అట్లయినపద.

వీర—ఈభాగ్యానికి నేరానోటెనా? ఓరికోటా! యీబాంబెనేయనకి కోటొరా లిచ్చిరా;

నక్ష—(కోటడితో నిష్క్రమించును.)

వీర—(హరిశ్చంద్రుని జూచి) మీపేరేంటి?

హరి—నా పేరు హరిశ్చంద్రుండు.

వీర—అరిచ్చచ్చాడు. ఏం పేరీ పేరు?

హరి—అయ్యా! కాదు, హరిశ్చంద్రుడు.

వీర—అబ్బో, అంతపొడుగు పేరెవరుపిల్తురు? యీరదాసుడని పెట్టితి. అటులుండుము.

హరి—చిత్తము.

నక్ష—(ప్రవేశించి) హరిశ్చంద్రా! మాఋణంబు దీరినది. నేనిక వెళ్లుచున్నాను. నాకనుజ్ఞనిమ్ము.

హరి—(సంభ్రమముతో) హరిహరీ! ఎంతమాటాడితిరి? మీకనుజ్ఞ యిచ్చువంతటి శక్తి గలుగువాడనా?

చం॥ అతిసుఖదాయివై జపత • పోధ్యయనంబుల ప్రొద్దుపుచ్చుచున్
చతురతరాశ్రమంబులను • చల్లనితావుల నుండు నట్టినీ
వతి కుతుకంబునన్ గురుని • యాజ్ఞ యెశ్రేయ మటంచు నెంచి యో
క్షితిసుర! మానిమిత్తమయి • జెందితి వెన్నియు బన్నముల్వనిన్॥

వటూత్తమా! నానమస్కారంబులు గైకొనుము; ఇప్పటి స్థితిలో నింతకన్న మీకేమియు సమర్పించుకొనుటకు శక్తిజాలనివాడను; శిష్యునిపై దయయుంచుడు.

నక్ష—(తనలో) అకటా! ఈరాజేంద్రుని, హృదయ మెంతగంభీరము. పుట్టినదాదిగ సత్యయశశ్చంద్రికలచే, వలరారు, నితని కెన్నికష్టంబులగూర్చితిని. ఇట్టి పరమశాంతునితో, మాటలాడుటకు, సైతము, నాకు నోరురాకయున్నది. (ప్రకాశముగా) రాజేంద్రా! ఘోరారణ్యంబుల, నిన్ను బెట్టిన కష్టంబులకు విన్నజాడ నాకే సిగ్గగుచున్నయది; నేనెన్ని జన్మంబుల నెత్తిన యీపాపంబునుండి విముక్తుడనగుదు?

హరి—(వటూత్తమా! నీవు జేసినదేమున్నది? నాపూర్వజన్మసంచిత కర్మవలన కష్టపడుచుంటిని. నీమది సంకోచమందకుము. సెలవొసంగుము. పోయివచ్చెద.

వీర—రావోయి! వీరదాసుడా! ఈకల్లుభాండం బెత్తుకొనిరమ్ము.

హరి—స్వామీ! వచ్చుచున్నాను. (అని కల్లుకుండ నెత్తుకొని నిష్క్రమించును.)

నక్ష— తే॥ గీ॥ గురునియాజ్ఞను జవదాట • కూడదనుచు
చేయరానట్టి పనులనే • చేసినాడ
ఘడమినపక్కీర్తికిని బాలు • పడినవాడ
ధరణిలో నెట్టు తలయెత్తి • తిరుగువాడ॥

(దుఃఖముతో) ధాత్రిలో ప్రతిమనుజుండును ననుజూచినపుడెల్ల యితడే! యితడే! సత్యవ్రతుండైన హరిశ్చంద్రుని వేధించినవాడని నన్నెంత యాడిపోసుకుందురో! గదా (అయిననేమి) ఇతండనృతమాడినవా ప్రతిజ్ఞ నెరవేరును. సత్యపథమునందేయుండిన యితనికీర్తి ధాత్రి. నాచంద్రార్కస్థాయిగా నుండుననియే గదా మాగురుని యుద్దేశ్యము. పుటము బెట్టినకొలదిగదా బంగారమునకు వన్నె హెచ్చుచుండుట. మాగురునివలన యితనికీర్తి అవనియం దాచంద్రార్కస్థాయిగా ప్రతిష్ఠింపబడినది. పాపమా లోహితాస్యుండా కాలకౌశికునింట నెటుల నున్నాడోగదా!

(నిష్క్రమించును.)

(కాశికాపుర స్మశానసమీపారణ్యము)

## చతుర్థ రంగము

(కాలకౌశికుని శిష్యులగు మాధవ, దామోదర, లోహితాస్యులు ప్రవేశింతురు.

లోహి—నెచ్చెలులారా!

తే॥ గీ॥ ఆటపాడుటచేవార • పాటు గల్గె
ప్రొద్దులేదింకఁ బోదమో • పూజ్యులార
సమిధలను దేక రిత్తహ • స్తముల జనిన
కాలకౌశిక సర్పంబు • గరువకున్నె॥

మాధ—దామోదరా! ఈలోహితాస్యుండు గురువుపేరనిన గడగడలాడుచుండును. మనకేమి భయము లేదే? ఇతనికింత భయమేమి?

దామో—కొన్నవాడగుటవల్లను క్రొత్తవాడగుటచేతను గురువున కింత భయపడుచుండును. చూచిరమ్మనిన కాల్చివచ్చు వారలమగు మనకేమిభయము?

లోహి—మిత్రులారా! మీరిక జాగుసేయవలదు; మనగురుం డతిముక్కోపి. ప్రొద్దు గ్రుంకుచున్నది. అతులను గోయుదము రండు.

దామో—లోహితాస్యా! ఆకులను దర్భలను గోయుము; మేముగూడ శాఖాపులకుబోయి కోసుకొని వచ్చెదము. (అని తలాయొక దిక్కునకు పోవుదురు).

లోహి—(వేలితో చూపుచు) ఇదిగో ఎదుట, నేలకువంగియుండు కొమ్మలుగల యీవటవృక్షంబున నాకులు గోసికొనియెద. (వృక్షంబు కడకుబోవుచు) ఓహో! నాకు యీ యాకులందవే (అని వల్మీకము చాయచేతివిజాచుచు) ఈవట వృక్ష కంటియుండు యీవల్మీకము నెక్కియైనను ఆకులను గోసుకొనియెద గాక (పుట్టనెక్కి యాకులగోయుచుండ సర్పంబుగరువ పుడమిపైబడి) హా! మిత్రులారా! నన్నొకపాము గరచినది. (దామోదరుడు మాధవుడు పరుగెత్తుకొనివత్తురు.)

మాధ—(ఆతురతతో) లోహితాస్యా! లోహితాస్యా! అయ్యో! ఎందులకిటు పడియుంటివి?

లోహి—(ఆయాసముతో) మిత్రులారా! ఏమనిచెప్పుదును? నేనా పుట్టనెక్కి యాకులను గోయుచుండగా క్రూరసర్పమొకటి నాపదంబును గరచె. నాదేహమంతయు విషానలముచే భగ్గుభగ్గున మంటలెత్తుచున్నయది. ఇక నేజీవించుట, దుర్లభము. హా! జనకా! ఎచటనుంటివి? హా! జననీ! ఏమైనా! నాచెంత లేవు గదా!

దామో—మాధవా! పాపమీ బాలుని కెంత యాపద తటస్థించినది? అయ్యో! నోట మాటాడలేక యున్నవాడే (శరీరమును స్పృశించి) ఒడలంతయు ముచ్చెమట చెనిండియున్నదే. త్రాగించుటకన్న పానీయంబైన లేదుగదా! ఏమిసేయుదము (అని పైయుత్తరీయముచే విసరుచుందురు.)

లోహి—(కన్నులు తెరచి) హా మిత్రులారా! నాప్రారబ్ధమునకు మీరేమి చేసెదరు? మీరిచట బాలస్యము జేసిన గురునిచే మాటవచ్చును.

సీ॥ తడవాయె నని మండిపడుచుండు • గురునకీ
యింధనంబులు దర్భ • లియ్యరయ్య
నన్ను గానకయున్న • నలమటించెదునాదు
తల్లికి గతిదెల్ప • తరలుడయ్య
అతి ధూర్తుడా గురుం • డడరికొట్టునొమిమ్ము
వేగంబె గృహముల • కేగరయ్య

తండ్రిని నట్టి బాసి • తల్లడించెడునాడు
మాతకే దుఃఖంబు • మాన్పరయ్య
తే॥ గీ॥ ధరణియంతయు దిర్దిరం • దిరిగెనయ్య
కన్ను లిటుమాత వడుచుండె • గానరయ్య
బ్రతుకజాలను విషమెగ • బ్రాకెనయ్య
జనుడి మీకిదె తుది నమస్కారమయ్య!

వీలుగానున్న మాతల్లినొక్కసారిచూచిపొమ్మని చెప్పుడు.(హాపరమేశ్వరా యని మూర్ఛిల్లును.)

దాహో—మాధవా! మనకేమైనామాటవచ్చునా?

మాధ—మనకేమియు మాటరాదు. మన మతిత్వరితగతిం జని యీదారుణవార్త యీతని తల్లి కెరిగింతము పద.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

## పంచమరంగము.

[కాలకౌశికుని మందిరము]

చంద్ర—(పిడుక లేరుచు)హాపరమేశ్వరా!పరేంగితజ్ఞానభాసమానభావుండును,స్వశరీర స్వర్గవాసుండును నగు త్రిశంకుభూపాలుని కొడుకవై నిత్యసత్యవ్రత సంపాదిత యశఃపరిపూర్ణకాముండును, సప్తసాగరవలయిత నవఖండలాధినాథుండును, సత్యకీర్తియు; జగత్ప్రసిద్ధకీర్తియగు ఆహరిశ్చంద్రచక్రవర్తికర్ధాంగినై, స్వర్ణమణిమయశిలానిర్మిత సౌధంబులయందు హంసతూలికాతల్పంబులం దనేక దాసదాసీ సహస్రంబు లాడిగంబులఁ సలుపశయనించియుండు, నన్నిట్టి దుర వస్థకు బాల్పడజేసితివిగా! హానాథా! నాయిప్పటి దురవస్థంజూచిన నీవెంత జాలినొందువాడవోగదా! అకటకటా! నే నెన్నికష్టంబు లనుభవించుచున్నను మీసుందరముఖావలోకనంబున, నాకష్టంబులన్నియు సుఖంబులుగానుండుగదా! ఇక నెన్నడైనను యుష్మద్దర్శనంబునకు పాత్రురాలనే? హా. ప్రాణపతీ? ఇపు డెచటనుంటివోగదా!

సీ॥ ఆలుబిడ్డలమీద • ననురాగమించు లేక.
నల్లాముచును నెందు • నరిగినావో

కడ కీ విపద్దశల్ • గనన యెట్లగా యని
పుడమిపై కాయంబు • విడచినావొ
సంపద లేనియీ • సంసారమేలని
నిస్సంగుడుగ నెందు • నేగినావొ
నిను జూడకయ నొక్క • నిముషమోర్వగ లేని
పుత్రునిపిడెట్లు • బోయినావొ
తే॥ గీ॥ విసుకుచే మమ్ము నక్కట • విడచినావొ
మానసంబున మము నెట్లు • మరచినావొ
అకట ధరలోన నీవు యు • న్నావొ లేవొ
దైవమా మమ్ము నేమిటు సేయ • దలచినావొ॥

(కంపితహృదయుడై) అహా! దుఃఖసంతప్తహృదయునై నేవిగాటియాజ్ఞమరచితి. ప్రొద్దుగ్రుంకముస్నా యీబుట్టనిండ పిడుకలేరవలయునుగదా! (పిడకలు బుట్టనిండా యేరి పకవోటకెట్టి) ఓహో ప్రొద్దుగ్రుంకవచ్చుచున్నదే. అకులకై వటువులతో నడవికంబోయిన నాలోహితాస్యుం డింకను రాకయున్నవాడే? కారణమేమైయుండును!

తే॥ గీ॥ లేగలకుపాలు నిడనెంచి • బాగుగాను
మందనుండెడు పశువు లం • బాయటంచు
పరువులెత్తుచునుండె న • త్వరముతోడ
నడవి కాకులకై బోవు • కొడుకు రాడు.

(దుఃఖముతో) హా! తనయా! ప్రశస్తంబైన భానువంశంబునంబుట్టి నదీకట్టలాకులను మోయుటకేనా? పట్టీ! పట్టుభోగుల యుండ్లయందుబుట్టి అష్టభోగంబుల ననుభవింపక నాయట్టి నిర్భాగ్యురాలికేలబుట్టితివి? అకటా? నేటిదినంబున నాకడకువచ్చి; గురుండడవికి యాకులకై బొమ్మనుచున్నవాడు, నాకాకలగుచున్నది. కడకింత కడుగైవా బోయుము తల్లీయనిన కడకింత కడుగైనను బోయుశక్తిలేని దానవైతినిగదా! హాతనయా! ఆకలిచే నడువలేక బడలితివో; ఆకులు దర్భలు యింధనంబులు; మోయలేక యింత జాగాయెనో! అస్తమయమైనను రావైతివి! నేడేమో నామానసంబతి కలవరంబుగానున్నయది (కొంతదూరము చని ముందుజూచి ప్రజాచి) అదుగో విప్రబాలకులు

వచ్చుచున్న వారలు నేననుకొనినటులా మాప్రభుమాయలేక వెనుక కొక్కొంగా బోలు! ఎదురుగా చనిరెద (ఎదురుగా జని) అహా! ఏమిది? నాకన్న తండ్రి కనుపడకున్న వాడు! బాలులారా? నాముద్దులయ్యారేమిడి!

మాధ—దామోదరా! దిక్కులు పరికించుచు నాసుతుండేడియని యడుగుచున్నది; ఆమెకేమని దెల్పుదుము!

దామో—ఏమి చెప్పుటకును నోరాడకున్నది; (మాధవదామోదరు లూరకుందురు.)

చంద్ర—అయ్యా! ఊరకుందురేల? మాలోహితాస్యుడేడీ?

దామో—నీకుమారుడా?

చంద్ర—(ఆతురతతో) అయ్యా! కుమారుడని ఆగదరేల? నాకుమారునకేమియు అప్రియము లేదుగదా? నాకడుపులో చెయిబెట్టి కలిపినట్లున్నది. త్వరగా జెప్పుడు.

మాధ—తల్లీ? మేమందర మాపులకొరకు అడవికింబోయి ఆకులను గోసికొని దర్భలకై తలకొకదారిం బోయితిమి. అంత నీసుతుడుకూడా దర్భలకై యొక పుట్టనెక్కి సర్పదష్టుండయ్యె?

చంద్ర—హా తనయా!!! (మూర్ఛిల్లును)

దామో—తల్లీ! ఇంకొక విషయము జెప్పవలెను?

చంద్ర—(దుఃఖించుచు) చెప్పెడిదంతయు చెప్పితిరిగదా? ఇంక చెప్పుట కేమున్నది.

మాధ—తల్లీ! అప్పుడు తడబడెడు వాక్యంబులతో జెప్పిన నుడువులు వినుము.

చంద్ర—తండ్రులారా! ఏమిజెప్పెను?

దామో—(పడవారొమునెడు సీసపద్యమును చదివి) మాకీమాటలు చెప్పినప్పుడు, ఆయాసమధికంబయ్యె నోటమాట కూడా సల్పిపోయి మరణబాధ ననుభవించుచుండె మేమట నిలువజాలక నీకెరింగింప వచ్చితిమి! ఈమార్గమున, తొలగక పోతివేని యొకవట వృక్షంబు గనుపడును, అవృక్షంబు నీడనే నీనందనుడు పడియుండును. పోయిచూచుకొమ్మ. మేము బోవుచున్నారము.

(నిష్క్రమింతురు.)

చంద్ర—(దుఃఖముతో) హా తనయా! ఎన్నియిడుముల బడుచున్నను. యవియన్నియును, నీముఖారవిందంబు, జూచినతోడనే, అడుగంటుచున్న విగదా? కొడుకా! నేనెట్లుజీవించగలను? హా లోహితాస్యా! ఆక్రూరసర్పంబు, నీకెక్కడదాపురమాయెను! అకటా! ఎన్నటికైనను, మన్నాథుండువచ్చి, నాకుమారుండేడి యనిన, నే నేమని తెల్పుదానను?

రాగమాలిక

సీ॥ శంకరాభరణమే • శంక నొందగ నేడు
యినవంశసాగరం • బింక జేసె
శ్రీరాగ రసముచే • చెలువొందు నీ మోము
జూచుచుండెడి సర్వ • సుఖము బాసె
భూపాల వంశవి • భూషణాకారనే
యుండగా గలనె నీ • యండబాసి
మోహనాకార నీ • ముద్దుపల్కులు విను
పుణ్యంబు నేటితో • బోయెనొక్కొ
తే॥ గీ॥ తోడి భూసుర బాలుర • గూడి వేగ
వచ్చుచున్నాడ వనునట్టి • భ్రాంతిమాసె
దేవ గాంధారి వేళల • దిక్కులేక
సర్పదష్టుండవై యిట్లు • జావ వ్రాసె॥

(కలహకంఠి ప్రవేశించును)

కల—(కోపముతో) దాసీ! ఏమిచేయుచున్నావే? ఎక్కడకసువు, అక్కడనే, యుంచినావేమిటి? దసమాలినదానా,

చంద్ర—అమ్మా! పిడుకలేరుచున్నాను. (ఏరుచు దుఃఖించును)

కల—అసురసంధ్యవేళ, మాయింటియం దెందుకే యిట్లేడ్చెదవు? అధ్వాన్నపుదానా! నీవేమని, మాయింట నడుగుబెట్టితివో. మాకన్నియు నష్టములే యగుచున్నవి.

చంద్ర—తల్లీ! నా దౌర్భాగ్యవశంబున నడవికి ఆకులకై బోయిన, నాకొడుకును, పాముగరచెను.

కల—పొట్టబగలతిని, పొగరుబట్టియున్నాడు లే, వానికట్టిగతి కావలసినదే; ఇట్ట లెక్క-లెందుకు?

చంద్ర—పనికాయకేమి తెలుసును? తల్లీ! నాకనుజ్ఞయిమ్ము. నా బాలుని జూచుకొని వచ్చెద;

కల—చచ్చిపోయినవానిని చూచేదేమిటే పిచ్చిదానా! మరల బ్రదికివచ్చునాయేమి? డబ్బిచ్చికొనినవారికి లేకపోగా వృత్తదానికి నీకొచ్చెనా దుఃఖము? ఛీ. ఛీ. అటు పడియుండుము.

చంద్ర—(కలకాకంఠి రెండు చేతులుబట్టుకొని) తల్లీ! నా ప్రాణములు నిలువజాలవు. ఇప్పుడే వచ్చెద. సెలవొసంగుము.

కల—(చేతులు విదల్చుకొని) వగలాడి, వగలేడ్పు, లేడ్చెదవేమే; నీవేగిన యీ పనులు నీమగడెవడు జేసును. ఈపనులన్నియు యేమియుకొరత లేకుండా జేసి, మాభోజనములైన తరువాత మాయింటియాయనకునాకుపాన్పుపరచి నిద్రపోవుదాక, కాళ్లుపిసికి అవల నీవెక్కడనయిన చావుము.

(నిష్క్రమించును.)

చంద్ర—ప్రాణేశ్వరా! నీవెచ్చటను యిట్టిదాసీత్వంబునం దగులుకొన లేదుగదా?

(నిష్క్రమించును.)

చతుర్థాంకము

సంపూర్ణము.



# అభినవహరిశ్చంద్ర.

## పంచమాంకము.

---

### స్మశానము.

హరి—(కాటి కాపరియై)

సీ॥ శవముల దహనంబు • సల్పిన మరుదినం
బూడ్చి పోసినయట్టి • బూడ్దెలివ్వి
పలలంబు లనుమెక్కి • కిలకిల లాడెడు
శాకినీ ఢాకినీ • చయము లివ్వి
వేద సారంబుల • వెదజల్లుచున్నయట
వసియించు బ్రహ్మరా • క్షసులు యివ్వి
రోదసీ కుహరము • స్ఫేదిల్లగాజేయు
మృత బంధుజనముల • మూల్గు లివ్వి

తే॥ గీ॥ కాలుచుండిన చితుల పై • న్నాంతులివ్వి
చేరనీయక మండెడు • చిదుకు లివ్వి
పొర్లియాడెడు యముకల • పోవులివ్వి
గాంచ భయమౌనుయీ వల్ల • కాటి దీవి

(సంభ్రమములో) అహా! ఏమిది, యీస్మశానమును జూచినకొలది నామానసం బమితజ్ఞానానందమయమగుచున్నది. ఇదియేగాబోలు స్మశానవైరాగ్యము

ప్రసూతి వైరాగ్యమను సామెత? ఎట్టికోపియైనను ఎట్టిపాపియైనను కుటుంబియైనను కుల నాశకుం డయినను తాపత్రయుం డయినను తరుణుండయినను ధనవంతుడైనను, దరిద్రుండైనను, స్త్రీలోలుండైనను, లోభియైనను, స్మశాన సందర్శనంబున సుజ్ఞానోదయం బువయించి వైరాగ్యపట్టాభిషిక్తుడగుట రుదా? వారగుట కేమిగాని, ఆలుబిడ్డల నొకరికి విక్రయించి, కటికవాడనైకడజాతి మాలకడ సేవంజేయు నాకిది ముఖ్యోపకారియాయె గదా! (మిన్నుజూచి మాటలధోరణినిబడి. మరచితిని. కాటిచట్టంబుల గుర్తెరుంగక యింగావరైనను శవదహనంబు సలిపెదరేమో! (దిక్కులుబరికించి) ఈస్మశాన సామ్రాజ్య పట్టాభిషేకమపుడు నాకమర్చబడిన యీ మంచె నెక్కికను గొనుచుండెదగాక.

సీ॥ రాజ్యమెల్లను గాధి • రాట్సూన్తి పాలాయె
నిల్లాయె నాకు యీ • వల్లకాడు
అష్టభోగంబులా • యడవుల పాలాయె
కడకు పీనుంగులన్ • గాల్పనాయె
సతి సుతుల్పరులదా • స్యములకు జిక్కిరి
సకల సౌఖ్యంబులు • సమసిపోయె
కట్ట బట్టకుగాను • గతియయ్యె నాకుయీ
కమురు కంపును గొట్టు • కాటికోక

తే॥ గీ॥ అకట సన్యాసి నైయిట్లు • యవనిలోన
బ్రదుకుమంచును నొసటనా • పద్మజుండు
వ్రాయ వ్రాతను దప్పునె • వ్వారివశంబు
కటకటా! యెంతవిపరీత • కాలమయ్యె

(వినుట నభినయించి) ఏదియో యొక అస్పష్టంబగు ధ్వని వినవచ్చుచున్నది అటుజని పరికించెదగాక. (నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

అరణ్యము (ప్రవేశము చంద్రమతి)

చంద్ర—హా! సర్వేశ్వరా! ఈనిశీధి సమయంబున, నాసుతుని జాడ దెల్పువారెవ్వరు?

సీ॥ నాకుమారునిజూపి • నన్ను రక్షింపరే
నగములార సువర్ణ • ఖగములార
తనయుడు బడియుండు • తావుజూపరెనాకు
ఝరులార గిరిగుహాం • తరములార
దెసమాలి బడియుండు • పసికూనజూపరే
దిశలార యో అష్ట • వసువులార
రా కుమారుని జాడ • నాకు జూపింపరే
మ్రాకులార ద్విజాది • మూకలార

తే॥ గీ॥ అష్టదిక్పాలులార యో • యసురులార
పంచ భూతంబులార రా • యంచలార
హరిహర బ్రహ్మలార యో • యమరులార
చూచియుండిన చెప్పరే • సుతుని జాడ॥

(అటునిటు వెదకుచు) ఆహా, కానికాలంబున, నాపలుకాలకించువారెవ్వరు? హా కుమారా! నాకనుల కగుపడకుండ నీవెచ్చట డాగియుంటివి? (అని వెదకుచు లాడుమండ పవముల కేదియో మెత్తగదగుల) ఇందేదియో కాలికిదగిలినది. (అని పరికించి) హా! లోహితాస్యా! లోహితాస్యా! (అని బాలునిపైబడి) నీకింతనీచదశ సంప్రాప్త మాయెనురా! శిరీషకుసుమ పేశలసమంబగు నీకాయంబీ కంటకసదృశంబగు మత్పద తాడనంబుచే నెంతకటకటం బడెనోగదా! నాయనా? నవమాసంబులు గర్భవేదన సహించి, ప్రసవవేదనభరించి, కని అల్లారుముద్దుగా బెంచినది కాలాహికర్పించుటకే గాబోలు! కుమారా! అఘట నాఘటన సమర్థుండగు నాభగవంతుం డేకపుత్రి విషయంబునన్మైన, రోయించక, నియంతం దెంత, కృతఘ్నత, బూనెనోయి! నిర్వక్ర విక్రమ పరాక్రమంబున, సర్వసర్వంసహా చక్రతలంబున కేలికయగు, చక్రవర్తి సుతుండవై. యీ దిక్కుమాలిచావు, చావవలసివచ్చెగదా? పుత్రరత్నమా! పలుకవేమి? నీయెడ నేనేమపకారము సల్పితిని? ఆవిశ్వామిత్రుని, కోపాగ్నికింధ నంబవైతివే? ఆ కాలాహి, నిన్నుగరచువేళ, యెంతని విలపించితివో ఎంతనియఱచితివో! ఎంతని పలవించితివో? ఎంతని చింతించితివోగదా? హా దైవమా! ఈసుతవియోగాగ్నిచే నాకడుపు దహించుక పోవుచున్నదే; నేనెట్లోర్చుదాన?

సీ॥ పతిబాసినను గాంత • గతిసీ వనుచు నాదు
ఆశయెల్ల నిరాశ • జేసితయ్య
నిన్నడ బాసి నే • నిముస మోర్వగ జాల
కన్నెత్తిజూడరా • కన్నతండ్రి

(మేనుస్పృశించి)

అగరు గంధములచే • నలరుచుండెడి మేను
ధూళి ధూసరితమై • దూగెనయ్య
ముల్కి నవ్వులు గుల్కి • ముద్దుమో మెన్నడు
గాంచెడు భాగ్యంబు • గలుగునయ్య
తే॥ గీ॥ అకట నన్నీడి పోవ నీ • కగునటయ్య
ఎన్న డిటువంటి దుఃఖమే • నెరుగునయ్య
అయ్యయో యింతలో నింత • యయ్యెనయ్యొ
దయివమా మమ్ము యెటుసేయ • దలచితయ్యొ!

మ॥ జననంబందెసి వేళభూసురులు పం • చాంగంబులన్ జూచి ప్రే
ళ్ళను లెక్కించి చిరాయువై బుధజనో • ల్లాసుండునై యుండు నీ
తనయుండంచు వచింపగా నదియె త • థ్యంబంచు నే నమ్మి యే
యనుమానంబును లేకయుంటి తనయా • యన్యాయమైపోతివే॥

పరమేశ్వరా! నేనిచింతాబ్ధిలో మునిగి మరచితి (ఆకసముపంక జూచి) ఇక జాము ప్రొద్దైనను లేదే. తెల్లవారకమునుపే, మాయజమాను రాలికగపడకున్న మాటవచ్చునుగదా? హా. దైవమా! నేనేమిసేయుదు? కుమారా! నిన్నీకానలో విడచిపోయిన, నీకాయంబు కాకోలముల గద్దల పాలవునుగదా? అకటకటా ఏమిచేయుటకు దోచకున్నది; (ఆలోచించి) ఎటులనైనను వీనినెత్తుకొని, అన్మశానంబునకు జనిదహనంబునరిపెద. హా ప్రాణేశ్వరా! మృతుండైన సుతునైన జూచుటకు, నోచుకొనవ, నైతివిగదా! (అనికుతునెత్తుకొని నిష్క్రమించుచు)

---

## "తృతీయరంగము"

## "స్మశానము"

హరి—హా దైవమా! ఏమి చిత్రమా! ఈదినంబున మరణమన్నను, మరణమునకు రాక, నా కన్నసుతుండగు, లోహితాస్యుం డెచటఁజూచిన, నచటనే కన్నులకు చొప్పెత్తినట్లు, ప్రతి బింబించుచున్నాడు. (ఆలోచించి) కాదు, కాదు, పుత్రవాత్సల్యంబును వదిరయే యీతీరున ప్రతిబింబించు చున్నదిగాని, మరియొకటిగాదు కుమారా! నీకు శుభంబగుగాక, (ఆలకించి) బరికించిచూడ, నిదియేదో యొక యార్తధ్వని వినవచ్చుచున్నది. పోయిచూచెదగాక (నిష్క్రమించును)

చంద్ర—(లోహితుని పరుండబెట్టి కట్టెలేరి తెచ్చి కాదు పేర్చి ముట్టించుచు) కొడుకా! ఏదహనకర్మంబులకు, కట్టెలుగూడా కరువయ్యెగదా? కడకీస్మశానంబున. చితులలో నారిపోయిన కాష్టంబులా నీకుగతి! హా. పుత్రకా! నేటితో నాకు నీ ఋణముదీరినది.

సీ॥ ఇలయేలు దీవుల • నేలువాడవటంచు
నసుకొంటిగాని యి • క్కాట యెరుఁగ
పేరు ప్రతిష్టల • బెంపొందు ననుకొంటి
పుత్రకా! నిన్ను నో • ల్పోవు టెరుఁగ
వసుధ చిరంజీవి • వై యుందు వనుకుంటి
కొడుక! ఘోరాహిచే • కూలు టెరుఁగ
పెండ్లి పేరంటముల్ • కండ్లగాంతనుకొంటి
నకటనే గొల్లడాల • నగు టెరుంగ

తే॥ గీ॥ తనయ! నీచేతి నీళ్లియా • ధారిమనుచు
దలచితినిగాని యిటులౌట • కలనెరుంగ
సుఖవతినటంచు మదిసొక్కు • చుంటిగాని
దైవమా! మమ్ము యిటుసేయ • దలచు టెరుఁగ!

హరి—(ప్రవేశించి కోపముతో) నాయుత్తరములేనిదే శిశువుకూడ దగులబెట్టిననే, (చంద్రమతియొద్దకు వెళ్ళి)

ఆ॥ వె॥ నాదు యాజ్ఞఁ గొనక • నడురేయి నీవిట్లు
శవదహనము సేయఁ • జాగి నావె?
చాలు చాలు యింక • సత్వరంబుగఁ బొమ్ము
అతివ కాదు యెవ్వ • రబ్బ సొమ్ము॥

ఛీ, ఛీ, అవతలకుఁ బొమ్ము, (అని క్షితినిఁ గూల దన్నును.)

చంద్ర—(పుత్రుని కౌఁగలించుకొని) నాయనా! బ్రతికినన్నాళ్లును అవమానంబు నొందుటే గాక మృతుండవైనఁ గూడ అవమానంబు నొందుచుంటివే తనయా! ఇదియంతయు కనులారాఁ జూచి నే నెట్లు సహింతును. ఆర్తజనరక్షణ దుష్టజనశిక్షణ, శరణాగత రిపురక్షణ విచక్షణ దక్షుండును, సంతతవిశ్రాంత దిగంత కీర్తికాంతామనోహరుండును, సప్తసాగర పరివేష్టిత భూతల వసుంధరా నాయకుండును నగు చక్రవర్తి కుమారుండ వైన నీకీ పల్లకాటిలో జానెడు నేలకు గతిలేకపోయె గదా? హా! దైవమా! ఏమి యీ అన్యాయము.

హరి—(సంభ్రమముతో) ఏమిది? మాటిమాటికి, చక్రవర్తికుమారుండని సంబోధించుచున్నది. (ఆలోచించి) మా లోహితాస్యుండు గాదుగదా! ఛీ. ఛీ. నాకీ యూహ యేల పొడమినది? పుత్రకా! నీకు శుభమగుఁగాక. (మిన్నుఁ జూచి) ఎవ్వరైన నేమి మా రేని యాజ్ఞ మీఱరాదుగదా. (ప్రకాశముగా) మానినీ! నీ వెవ్వరి యాజ్ఞఁ గైకొని శవదహనంబు సల్పఁబూనితివి? ముందు చెప్పుము.

చంద్ర—సుతశోక సంతప్త హృదయనగు నాకీ సందర్భమేమియు తెలియక నొనర్చితి. క్షమించుము.

హరి—అటులనా? ఎఱుఁగనని క్షమాపణ చేసుకొంటివి కదే బ్రతికిపోయితివి లేకయున్న నెప్పుడో నీ కంఠంబీ ఖడ్గంబునఁ గోసివేసియే యుందును. అతివా! మా దొరవారల కీయవలసిన వాయిబియ్యము, కాటిపాతికయు, మూరెడుగుడ్డయు నిచ్చి యటుపై శవదహనంబు సల్పుము.

చంద్ర—అయ్యా! కాటిపాతిక నిచ్చుటకే శక్తియున్న దాననైన యీనిశీ సమయంబున నేను ఒంటరిగా నిటుల వత్తునా? పదుమంది బంధుగులు నావెంట రారా? నిరుపేదరాలను దిక్కులేని దానను. మహాత్మా! కరుణించి, నాకనుజ్ఞ యిమ్ము.

హరి—మగువా! నినువంటి వగలాడి నీజగతిలో నెందును గానను. చక్రవర్తి సతివే యైయుండి యీ కాటిపాతిక నివ్వఁజాలు నంతటి శక్తి నీదగ్గఱ లేదా? ఏలయీ వగ లేడ్పు లేడ్చెదవు? ఇక నీవగలు మాని మాకీయదగు సుంకమిచ్చి దహనంబు

జేసికొనుము. లేకయున్న నావలకేగుము. (అనిశవము విడ్వబోవ, చంద్రమతి అడ్డముజన విడిపించును)

చంద్ర—(అడ్డముజని) అనుగ్రహించుము; పతివిహీనను,బంధువిహీనను, సుతవిహీనను ధనవిహీనను, నిరుపేదరాలను, దిక్కులేనిదాననని ఇదివరకే మనవి జేసుకొంటిని, గాని; మీయాజ్ఞ మీరితినా?

హరి—(సంభ్రమాశ్చర్యములతో) అహా! ఏమిది? స్వప్నమందైనను అన్యసతీమతల్లుల అన్యథా భావింపని నాకీ సుకరస్పర్శనంబున, నకారణంబుగా నాశరీరంబు పుల కాంకురంబు లెత్తినదే? ఈమె నాసతియగు చంద్రమతియా? (చనిపోయిన లోహితాస్యుని జూచి) ఈచనిపోయిన వాడు నాసుతుండగు లోహితాస్యుం డాయేమి? ఏమిది? ఈనాడిట్టి పాడుయూహలు పొడముచున్నవి. పాపము శమించుగాక! మాలోహితాస్యుండు చిరంజీవియై వర్ధిలుగాక. ఈమానినిమ తల్లియెవరో, యొక మహాపతివ్రత గావచ్చును ఎవరైననేమి? ఈకాటిసుంకంబు పుచ్చుకొనక తప్పదుగదా? (ప్రకాశముగా) తరుణీ! నీవెంత దుఃఖించిన నేమి ప్రయోజనము? కులశీలములు యేటగలిపి, కడజాతి మాలవాని కొల్లబట్టుచు నుదకీ వల్లకాటికాపరినైన యీశుష్కునకు, యీదుశ్శీలునకు, యీకులనాశకునకు జాలిజనించునే? లలనా! దిక్కులేదని చెప్పుచున్నావు గాన మాయజమానునకు జేరవలసిన, కాటిపాతికయు, గుడ్డయునిమ్ము. ధర్మమునకై నాకు రావలసిన వాయిబియ్యమును విడచిపెట్టెదను.

చంద్ర—(ఆశ్చర్యముతో) అహా! ఏమిది? ఈమాటలధ్వనిని బట్టిచూడ పూర్వ మెచ్చ టనో వినినట్లు స్ఫురించుచున్నది ఇతండు మన్నాథుండు గాడుగదా! (దుఃఖ ముతో) ఏమిటీ పిచ్చికోరిక? పుట్టు నిర్భాగ్యురాలనగు నాకు నాధుని దర్శనము గూడనా? (ప్రకాశముగా) హానాథా! నీవిప్పుడేమి చేయుచుంటివి? ఎచ్చట నుంటివి? ఎన్నడుజూడకున్న నిముషంబొక యుగముగా నుండునో,యెవనిపొత్తున నారగించని దినం బుపవాసదినంబుగా నుండునో యెవని ముద్దుమాటలకు సంతసించి ఆనందాబ్ధి నోలలాడుదురో చిన్ననాటనుండి అల్లారుముద్దుగ బెంచి న మీముద్దులయ్యాయగు యీ యేడుమాండ్రుగనికి వల్లకాటిలో తావులేక పోయె గదా? (హరిశ్చంద్రునితో) అయ్యా? నన్నింత తరచెదరేల? దిక్కులేనిదాన నని, నిరుపేదరాలనని, యిదివరకే మనవిచేసు కొంటినిగదా?

హరి—నీ వెంత మాయలాడివే! ఇన్వ్వాలయమునని నీదగ్గిర నేమియు లేదా?

చంద్ర—ఇచ్చుటకు శక్తియున్న నిట్లున్న్న వ్రత మాడుదునా?

హరి—ఆహా? ఏమి నీమాయలాడితనము?

తే॥ గీ॥ బాల భానుని కిరణ వ్ర • జాలియనగ
మేలికాంతుల గ్రొక్కారు • మెఱుపనంగ
పయ్యెదనునుండి తళతళ • మంచు మెరయు
నీదు మంగళసూత్రంబు • నెలత లేదె?

చంద్ర— (నివ్వెరపడి) ఏమిది! నామంగళ సూత్రంబు మన్నాధునికింతప్ప నొరుల కగుపడదుగదా ? ఇప్పుడీ చండాలున కెట్లగుపడె ? (ఆలోచన సఖిన యించి) ఇతండు చండాలుండుగాడు. నిక్కముగా మన్నాధుండే హా! ప్రాణేశ్వరా (అని మూర్ఛిల్లును)

హరి—(ఆశ్చర్యముతో) ఇది కలయాయేమి? ఈసతి చంద్రమతియా? ఈ మృతుండైన వాడు మాలోహి తాస్యుండా? హాదమారా! నీకెట్టిగతి సంప్రాప్తించెను. (అని నివ్వెరపడి చూచుచుండును.)

చంద్ర—(లేచి హరిశ్చంద్రుని కౌగలించుకొని)

మ॥ చతురం భోధి పరీతభూ వలయ రా • జ్యంబంత పాలించి సం
తత విశ్రాంతదిగంతకీర్తిలత చే • నాగర్భ శ్రీమంతుడౌ
క్షితి నాధుం డనృతంబు లాడని మహా • క్షేమంకరుండైన భూ
పతి యీ తీరున వల్లకాటబడి కా • ల్పంబూనె నే వీన్నులన్

నాధా! మునిబుఃఖంబుదీర్చి, మీరెచటనైన సుఖంబుంటిరని, దలంచితిగాని, యీవల్లకాటి కాపురంబుండు టెనెరుంగగదా? హా దైవమా! నిత్యసత్య వ్రతమునన్నంపాదిత కీర్తిచే జగత్ప్రసిద్ధి కెక్కిన యీ చక్రవర్తి నిట్లక్రమంబుగా యిక్కట్టులముంప నీకేమపకారంబు సల్పితిమి?

సీ॥ ఇల నేడు దీవుల • నేలుటాయెనె నీకు
వల్లని తోడు యీ • వల్లకాడు
నవరత్న మయమైన • నవ్య సింహాసనం
బాయె నీకు జూడ నీ • పాడు మంచె

వందిమాగధుల కై • వారంబులాయెనా?
శాకినీ ఢాకినీ • చయరవంబు
హితమంత్రి జన పురో • హితబృంద మాయెనా?
యకట యీ ఘోరవి • దయ్యముల గుంపు

తే॥ గీ॥ కడు ననహ్యంబుగా దెసల్ • గ్రమ్ము కొనెడి
కమురు కంపున దోగునీ • కాటి కోక
పట్టు పుట్టంబె? స్వామి! నీ • కట్టుటకును
కటకటా యెట్టి కష్టంబు • గల్గె మనకు

హా! జీవితేశ్వరా! కాలకాళకుం డాకులకై అడవికంప, నందు సర్పదష్టుండై మృతినొందిన, మన ముద్దులయ్యను, జూడుము.

హరి — (కుమారుని పైబడి) హా! లోహితాస్యా! భానువంశ భాగ్యోదయా? సర్వసద్గుణ సముదయా? ఎన్నికష్టంబులు గల్గినను, నిన్ను జూచినతోడనే, అవియన్నియు మటుమాయమై పోవునుగదా! కన్నతండ్రీ! నిన్ను బాసి నేనెట్లు బ్రతుకగలను? కుమారా! నేనెంతనిర్భాగ్యుడను. ఈధరాచక్రంబంతయు, నేకచ్ఛత్రంబుగా బాలింతువనుకుంటిగాని, యిట్లు పమృత్యువున కాహారమగుదువని యెరుంగలేకపోయితి నిగదా! ఎన్నడునిటువంటి వార్తవిందునని, స్వప్నమందైనను, దలపలేనుగదా? హా పుత్రరత్నమా? నిన్నెట్లుజూతు? ఈదుఃఖంబె నెట్లుభరింతు? నీసౌందర్యాది గుణంబుల నేనెట్లుమరతు? నాకన్న తండ్రీ! నీవులేని నాజీవితము, కౌన గాచి నవెన్నెలగాదే? కమలంబులులేని కొలనుగాదె? రేరాజులేని రాత్రిగాదే? అకటా, నేనెట్లు జీవింతు ఇందుకే గాబోలు, యీ వాడెచ్చటజూచిన నచ్చటనే కన్నులకచ్చొత్తినటుల, గన్పడుచుండుట! హా. హతవిధీ! మ మ్మెంతయిక్కట్టుల నొందించుచుంటివి? హా. తనయా! పాపము పసిబాలుండవు నైన దలంపక అకులకైకొనకు బోవ్మైన నాపారుని, నోరట్లాడవోయీ? అన్నా! ఆకాలాహిం జూచి యెంతకటకటంబడితివో గదా?

సీ॥ కాలాహి నినుబట్టి • కాటు వేసెడి వేళ
అడవి నీ వెటుల • ల్లాడి నావొ
బాబయ్య వచ్చిన్నా • బాధ మాన్పవె యని
యెంచి యెంతని విల • పించినావొ

విసమెగబాకి నీ • యసువు లూడెడివేళ
దిశలు వాపోవ నెం • తేడ్చి నావొ
కన్న వారిటువచ్చి • కనులజూడ రటంచు
దుఃఖంబు చే నెంత • దూరినావొ
తే॥ గీ॥ ఎంత నిర్భాగ్యు లంచు నీ • వెంచి నావొ
పూర్వ కర్మంబుచే నిట్లు • పొలసి నావొ
విసువుచే ప్రాణముల నెట్లు • విడచి నావొ
దైవమా నాదు తనయుని • గావలేవొ

హాతనయా! ననువీడిపోవుటకు, నీకెట్లొప్పెనోయి? అనవరతం బనేకదాస దాసీజనంబు సేవింపఁగాని సుఖపరిణామకల యిందుగాని కోమలుబాడినను కనులుమూయని నీవు యీకఠినోపస్థలంబున నెట్లు గాఢనిద్ర జెందుచుంటివి? ఎన్నటికైనను యీబన్నంబులంత ముగిపకయుండునా? నిన్నుజూడక యుండునాయని పుట్టెడాసతోయున్న నాకీదుఃఖం బొడికట్టి, నీవెట్లుబోయితివి?

తే॥ గీ॥ అకట సాగర పరి వేష్టి • తాఖిలావ
నీ తలంబెల్ల నేలువా • డీతడనుచు
నెంచి యుంటిని గాని నీ • వింతలోన
నసువుల త్యజింతు వంచు నే • నాడు నెరుగ

చంద్ర—(భర్తకన్నుల నరయుచుండి) ప్రాణేశ్వరా! మనమెంత చింతించినను, మృతుండైన, పుత్రుండు, బ్రతుకునా? ఏలమీరిట్లజ్ఞానాంధకారంబునంబడి, విలపించెదరు? పూర్వజన్మంబున, యేరికేమపకారంబు సలిపితిమో, అయ్యదియీవిధముగ పుత్రశోకముగా పరిణమించె (ఆకసముపంకజూచి) అయ్యో! తెల్లవారవచ్చుచున్నదే, సూర్యోదయంబుగాకమున్నే మాయజమానురాలికడ మేలంగకున్న ఆజ్ఞోల్లంఘనంబు జేసినదాననగుదుగదా? ప్రాణేశా? యెటులైనను పుత్రునియుత్తరక్రియల కాజ్ఞయిండు.

హరి—సతీమణీ! స్వామియాజ్ఞ మీరకచరించుటే, సేవకుని ధర్మంబుగదా! ఇట్టితరి స్వామియాజ్ఞమీరిన నే స్వామిద్రోహుండను, గానే! కావున నీవెటులైనను నీయజమానురాలినడిగి, కాటిపాతికయు, గుడ్డయు గొనిరమ్ము.

చంద్ర—హా! పరమేశ్వరా? మాకెంత దురవస్థ సంభవింపఁజేసితివి? సర్వసర్వంసహాచక్రతలంబెల్ల నేకచ్ఛత్రంబుగా బాలించిన, యీచక్రవర్తికిఁగూడ తనకుమారుని దహనంబు సేయుటకు నొకరియాజ్ఞ కావలసివచ్చెఁగదా! మాయజమానురాలినడిగిన కోపగించుకొనునేమోగదా! హా! కోపగించుకొనిన నేనేమి సేయుదును! పాదములమీఁబడియైనను వేడుకొనియెద. అంతటనైననుజాలిజనింపకుండునా? జీవితేశ్వరా? నేనువచ్చుదాక యీతనయుని జూచుచుండుము.

(నిష్క్రమించును.)

హరి—అపుత్రస్య గతిర్నాస్తి యనురీతిగా నేనిప్పుడు నిజముగా గతిలేనివాఁడనే యయితిని. హా తనయా! నవకిసలయసదృశంబగు నీమేను నాపదతాడనంబుచే నెంతనొచ్చెనోగదా! పుత్రరత్నమా? మృతుఁడవైగూడ నీమోము కాంతినెంతెంత ప్రకాశింపఁజేయుచుంటివి!

మ॥ కడుగో గంజిరియు త్రావి ప్రాణములచేఁ గ్రబట్టియొట్టెట్టొ యీ
పుడమిం క్షేమము గలిగియుంటివనుచు న్మోదంబు సంధిల్ల నే
కడు సంతోషము తోడనుంటి; కడ కీ కాలాహి పాలైతి వే
కొడుకా! యెవ్వరిఁజూచి ప్రాణములవ్యాంతోకుశంబునన్ నిల్పుదున్

(తెరలో కలకలము)

(ఆలకించి) ఏమిటీదాధ్వని? (అ॰ వినుటనభినయించును)

(తెరలో) ఓరీ వీరదాసు! యీకొంటె కాశీరాజకుమారుని జంపి, నగలెత్తుకపోయినని నేరమారోపింపబడి, న్యాయశాస్త్రరీత్యా రాజుచే మరణదండన విధింపబడి వీరబాహునకిడకంప నాతింపఁటకొప్ప. నీవీక్షణంబున నీకాంతకంఠంబు నిఖడ్గంబున కెరజేయుము.

వీరదాసు—యజమానునియాజ్ఞనుల్లంఘింతునా?

చంద్ర—(ప్రవేశించి నిలువబడియుండును.)

వీరదాసు—(భయసంభ్రమంబులతో) ఆహా! ఏమిది? కలయా? ఈసతి నాసతియైన చంద్రమతియా? అకటా! కాలమెంత విపరీతము? హా పరమేశ్వరా? నిరపరాధుల నపరాధుల జేయుచుంటివే! పూవులమ్మినయంగటిలోనే కట్టెలుగూడ నమ్మజేయుచుంటివా? ఈసతి యిట్టియవినీతిపనులు జేసియుండునా? పుట్టుకతో

వచ్చినబుద్ధి ప్రకటతో బోదనురీతి పుట్టిబుద్ధిరిగి, యుక్తరిసామ్మనిన చేపట్టని యీబోటి యీరాపట్టినిజంపి నగలుగైకొను టెట్లు! నేరంబుకేసిన దనుకొందుమా; ఈమానినిమణి నాకడనుండి జనిన, దొక నిముసంబైనను గాలేదే! ఇంతలో, నింత పనిజేయు టెట్లు! ఇదియుంజూడ, యీ విశ్వామిత్రు కృతంబైన, ఇంద్రజాలముగాని వేరొకటిగాదు.

తే॥ గీ॥ ధరణి నాథుండు తప్పొప్పు • లరయ లేద
న్యాయ మన్యాయ మిదియని • రోయ లేద
సకల మెరిగిన యాకర్మ • సాక్షి లేడె
అతివ నీకేడ గలిగె యీ • యప యశంబు?

చంద్ర—నాథా! ఏచే ననుజ్ఞగైకొని, రాజవీధిని నేబోవుచుండ, నాపదముల, కెదిరియై మెత్తగా తగుల, సంశయించి, పరిశీలించుచుండ, నొక బాలశవంబు, గనుపడియె. మన లోహితాస్యుం డిట కెటులువచ్చెనాయని, తర్కించుకొనుచుండ నింతలో నిరువురు మనుజులు వచ్చి యొక నగలమూట, నాయొడిలో వేసి, దొంగదొంగయని కేకలు వయిచి, నన్ను. రాజసన్నిధానమునకు, గొంపోవ నా నృపుండు, నాకు మరణశిక్ష విధించె. ఇదియే జరిగిన వృత్తాంతము.

వీరదాసు—(విచారముతో) (చంద్రమతిచేయిబట్టుకొని)

సీ॥ నిత్యసత్యవ్రత • నియుతు డంచు జగాన
వాసి గాంచినది నీ • వలన గాదె
అష్టభోగంబుల • ననుభవించి ధరిత్రి
ఖ్యాతి గాంచినది నీ • చేతగాదె
పితృ పవిత్రునిగని • శీతలుగా జేసి
మమ్ము బ్రోచినది నీ • మహిమగాదె
గాధినందను ఋణ • బాధను దొలగించి
ఘనత గాంచినది నీ • కతన గాదె

తే॥ గీ॥ సర్వ సుఖము లీనాటితో • సరియ గాదె
తఱిని యిట్లౌదువంచు నే • దలుప లేదె
నాదు వంశాబ్ధి యింటటీ • నాడుగాదె
కలికి! నీవిట్లు యగుట నా • కర్మగాదె

చంద్ర—(హరిశ్చంద్రుని కౌగలించుకొని) హా ప్రాణేశ్వరా!

సీ॥ అపయశంబు గణించి • యవని యుండుట కన్న
మీచేత మృతి యొందుటో • మేలుగాదె
కంఠావరణమందు • కఫము గప్పఁగ మున్నె
కడ కేటు లొటయే • ఘనముగాదె
మనవంశమున కవ • మానంబు ఘటియించి
ధాత్రి జీవించుటే • రోతగాదె
అల హరిశ్చంద్రుని • యతివ హంతకి యన్న
వసుధపై మీకున్న • వన్నె చెడదె

తే॥ గీ॥ ధర నశాశ్వతమైనది • తనువు గాదె
మనమునందింక దుఃఖంబు • మాన రాదె
ఎప్పటికి దేహి కిల చావు • దప్ప బోదె
సూనృతము వీడకుండుటే • శుభము గాదె

"ఋణానుబంధరూపేణ, పశుః పత్నీ, సుతాలయః" అనురీతిగా, మన మెవ్వ రెవ్వరి కెంత ఋణమో యంతే ఋణము దీర్చుకొని పోవుచున్నాము, "అనిత్యాని, శరీరాణి విభవో నైవశాశ్వతః" అను సూక్తిచొప్పున నెప్పటి కైనను యీ తనువు లంత నుండుట తప్పును గదా! ఈతనువు నేదో యొక తీరున వీడుటకంటె మీచేత మృతినొంది స్వర్గంబుచూరగొంట మేలుగాదే

హరి—తే॥ గీ॥ కులము పెంపొందు కొడుకును • గోలుపోతి
కోమలిని కత్తితో గొంతు • గోయనుంటి
కలలనైనను నిటులౌట • దలపనైతి
వసుధ బ్రతికియు జీవచ్ఛ • వంబ నైతి

కలికీ! అరుణవర్ణంబై, రక్తమునను, నావరింపబడి, నిగనిగలాడు నీ వధ్య శిలనెక్కుము,

చంద్ర—(వధ్యశిలనెక్కును)

హరి—నాతిమణీ! నీయిష్టదేవత నొకసారి ధ్యానించుకొనుము. ఈ తడవు చేసిన, స్వామియాజ్ఞ మీరినవాడ నగుదు;

చంద్ర— తే॥గీ॥ అంబ! నిను నమ్మి యుంటని • శ్కాంబరోని
భక్తులన్బ్రోవ నీకు నా • సక్తియేని
జన్మజన్మము లకు హరి • శ్చంద్రనృపుని
భర్తగా గూర్చు మమ్మనే • ప్రస్తుతింతు

నిశ్చేష్టితయై, వధ్యశిలమీద, నమస్కృతిముగా, కనులుమూసుకొని, నిలువబడియుండును.)

హరి—(ఖడ్గంబు చంద్రమతి కంఠంబుపై వ్రేయనది మొక్కబోయినటు లుండును) (ఆశ్చర్యముతో) ఓహో, ఏమిటీ యాశ్చర్యము! అరిగజకంఠలుంఠన కంఠీరవం బగు మత్కరవాలంబీ కలకంఠకంఠి, కంఠంబునగిలి, మొక్కబోయినదే! అకటా! నావలననేమైన నపరాధంబు, జరిగనారయేమి?

సీ॥ పదునాల్గు జగముల • పరిపాలనము సల్పు
జాలి చరించు ది • క్పాలులార
నాయురారోగ్యమా • నౌషధంబుల గూర్చి
దివిరెడు నశ్వనీ • దేవులార
ప్రాణిజేసెడుపుణ్య • పాపముల్గని దివి
చరియించు నో సూర్య • చంద్రులార
ప్రాణుల సృజియించి • పాలించి శిక్షించి
కీర్తి జెందిన యో • త్రిమూర్తు లార

తే॥ గీ॥ విమల మతులార ముక్కోటి • వేల్పు లార
జపతపంబుల సల్పెడి • తపసులార
కలుష మను మాట నాయందు • గలుగ దేని
యతివ కంఠంబు తెగు నిపు • డద్భుతముగ.

విశ్వా—(వడివడిగా ప్రవేశించి హరిశ్చంద్రునిచేతి ఖడ్గము పట్టుకొని) హరిశ్చంద్రా! హరిశ్చంద్రా! అగుమాగుము, స్త్రీని జంపిన, స్త్రీహత్య మహాపాతకమని నీకు తెలియదా? మాననీయంబైన, భానువంశంబున జన్మించినవాడిట్లు మానినీమణుల జంపుటకేనా?

హరి — అయ్యా! ఇంక మీసంగతి యేమున్నది? ఇటననవసర సంభాషణమేల? నామీద దయయుంచి యానలకు జనుడు. (అని క త్తిమోసుకొని మరల చంద్రమతి కంఠముపై వ్రేయబోవ)

విశ్వా — (మరల అడ్డంబుజని ఖడ్గంబు గట్టిగాపట్టుకొని) హరిశ్చంద్రా? హరిశ్చంద్రా?, మీగురువే గెలిచె? నేనోడితిని! ఇకనీకీ పంతమేల! నామాటవిని నీపనిమానుము.

హరి — మునివర్యా? గురువు గెల్చెనేమిటో నీవోడుటేమిటో అగోడవ నే నెరుంగను. మాతేని యాజ్ఞమీరువాడను గాను. మీరాపలకుజనుడు (అనిక త్తియూడదీయును)

విశ్వా — (అటునిటు పరుగెత్తుచు)

సీ॥ పరుగులెత్తుచునేను • బ్రతిమాలు చున్నాడ
మోహమైన జూపర • మోక్షనశిష్ట!
నీవైన వచ్చి యీ • నెలత గావగరాదె
సురపతీ! నీకింత • చులకదనమె
ఏలరారయ్య మీ • రేతెంచులోపల
తన పూనిక దీర్పడే • ధరణి విభుడు
తెగినదాక బిగించ • తగునటయ్యా మీకు
గడచి బ్రతికిన వారు • గలిగి రయ్య

తే॥ గీ॥ కోపమేనాదు కొంపను • గూల్చెనయ్య
ఇంతగానన్ను నెందు కే • డ్పింతురయ్య
చేయరానట్టి శపథము • జేసియనయ్య
యెంచి మీసమ్మె కట్టు చా • లింపరయ్య

హరి — (చంద్రమతి కంఠము పైకత్తి వేయుబోవు)

విశ్వా — (పరుగెత్తి పట్టుకొని) కాశీవిశ్వేశ్వరా? ఎవ్వైనను కరుణించరాదా?

పార్వతీ, పరమేశ్వరులు, ప్రత్యక్షమగుదురు.)

ఈశ్వరుడు — హరిశ్చంద్రా? నీమనోధైర్యంబునకు మెచ్చితిని. ఇక నీపని మానుము. (అని హరిశ్చంద్రుని? చంద్రమతిని నమీక్షింతురు.

హరి — దేవాదిదేవా? మీకివేవందనంబులు దేవా మీరెన్ని చెప్పినను నాయేలినవారి యాజ్ఞలేనిదే నేనీపని మానువాడను గాను.

ఈశ్వ—హరిశ్చంద్రా! నిన్నుగొనిన యీవీరబాహుండు యముండుగాని పంచమజాతి వాడుగాడు; నీసతినిగొనిన కాలకౌశికుడు శనైశ్చరుండు. ఇదియజ్ఞవాటంబుగాని శ్మశానంబుగాదు. ఇదిగో దివ్యదృష్టినిచ్చెద జూడుము. (అనిదివ్యదృష్టినిచ్చును.)

హరి—(చూచుచు) మహాత్మా! ఇకనీదివ్యదృష్టివిరమింపుడు. నేకృతార్థుండనైతిని.

సీ॥ నిర్మలమందాకి • నీశిఖిపింఛాయ
ఆనందరూపాయ • నారదాయ
వేదాంత వేద్యాయ • విబుధ సంసేవ్యాయ
విమలాంతరంగాయ • వితరణాయ
భస్మాంగ రాగాయ • ప్రమథాధి నాథాయ
రుద్రాక్ష మాలాయ • భద్రకాయ
నాగేంద్రహారాయ • నంది తురంగాయ
నారాయ ణాత్మాయ • కారణాయ

తే॥ గీ॥ నీలకంఠాయ నిత్యాయ • నిర్మంగాయ
నిత్య నైమిత్తికాయ యో • సర్వగాయ
దక్షయజ్ఞవినాశాయ • తాపసాయ
మార సంహారణాయ న • మశ్శివాయ॥

పార్వతి—(చంద్రమతి యొద్దకుజని) చంద్రమతీ! పతివ్రతా సౌశీల్యాది గుణంబులచే నీకీర్తిఆచంద్రార్కస్థాయిగాప్రతిష్ఠింపజేసితివి. ఏదైననొకవరంబుకోరుకొనుము

చంద్ర—(నమస్కరించుచు)

తే॥ గీ॥ ఓనగాధీశ పుత్త్రి క • ల్యాణగాత్రి
రాజరాజేశ్వరీ గౌరి • రమ్యనేత్రి
కాళి కంకాళి సర్వలో • కైకవినుత
వందనముజేతు గొనుమమ్మ • సుందరాంగీ.

దేవీ! ఈ కాశిరాజపుత్త్రుని, బ్రదికించి నాయపనింద బాపుము.

పార్వతి—(పిల్లకాయల నిరువురను హస్తములతో స్పృశించ బ్రతుకుదురు)

విశ్వా—రాజేంద్రా! నీరాజ్యంబు నీవు గొనుము. అయోధ్యకుం బోవుదమురమ్ము.

హరి—అయ్యా? ఇచ్చినది మరలగొనుట దత్తాపహారణము గాదే! నేనిపునికియ్య కొనను. మీయిష్టమున్న వారికిండు.

విశ్వా—అటులనా! నీవేనాకు నచ్చినవాడవు. రాజ్యము గొనెదవా లేక అనృతమాడెదవా?

వసి—హరిశ్చంద్రా! ఈముని యిష్టానుసారముగా రాజ్యమును గైకొనుము. పాపము; నిన్ననృతం బాడించవలయునని యెన్నియో బన్నములబడి తుదకు వృధయయి పోయినాడు (విశ్వామిత్రుని చాయజూచి) విశ్వామిత్రా! మున్ను సురేంద్రుని సభలో మనమాడుకొనిన శపథంబుల సక్రమముగా నెరవేర్చెదవా!

విశ్వా—ఎప్పుడో యివ్వనేల? ఇప్పుడేయిచ్చెదను (అని పుణ్యము ధారబోయును)

పార్వతీ-పరమేశ్వరులు—హరిశ్చంద్రా! విశ్వామిత్రుని యాజ్ఞానుసారముగా జనుము.

హరి—చిత్తము.

విశ్వా—వసిష్ఠా! మనమందర మయోధ్యకుం జని, యీతని పట్టాభిషేకోత్సవమును జరిపి వత్తమురండు (అని అందఱు నిష్క్రమింతురు.)

సూత్రధారుడు—(ప్రవేశించి)

## భరతవాక్యము.

తే॥ గీ॥ బన్నము లవెన్ని యొదవిన • ప్రాప్తమనుచు
సుఖము దుఃఖంబు లొకటిగా • జూచుకొనుచు
సత్యవర్తను యీహరి • శ్చంద్రు రీతి
యుండినను సౌఖ్యమొదవు నీ • యుర్వియందు.

శ్రీ అభినవ హరిశ్చంద్ర - పంచమాంకము.

సంపూర్ణము.

---

శ్రీ కృష్ణార్పణమస్తు.

# ప్రకటన.

---

ఈ గ్రంథకర్తచే రచింపఁబడి వెలువడనున్న గ్రంథములు.

1 పల్నాటి విజయము. }
2 ఇందిర. } చక్కని నాటకములు.

వలయువారు ఈక్రింది చిరునామాకు వ్రాసి ముందుగ దమ పేర్లు రిజిష్టరు చేయించుకొనుట మంచిది. కొలఁది ప్రతులు మాత్రము ముద్రింపఁబడుచున్నవి.


☞ మేడూరి హనుమయ్య,

ఘుణియ పూడి.

వెలంపల్లి పోస్టు,

గుంటూరు జిల్లా.

